రేకు: 0042-1 ఆహిరి సంపుటం: 06-001

పల్లవి: చిన్ని శిశువూ చిన్ని శిశువూ
యెన్నఁడుం జూడ మమ్మ యిటువంటి శిశువూ

చ. 1: తోయపుంగురులతోడఁ దూ గేటి శిరసు, చింత
కాయలవంటి జడలగములతోడ
మ్రోయుచున్న కనకంపు మువ్వల పాదాలతోడ
పాయక యశోదవెంటఁ బాఱాడు శిశువూ

చ. 2: ముద్దుల వ్రేళ్లతోడ మొరవంక యుంగరాల
నిద్దపుంజేతుల పైఁడి బొద్దులతోడ
అద్దపుంజెక్కులతోడ నప్పలప్ప లనినంత
గద్దించి యశోద మేనుఁ గౌఁగిలించు శిశువూ

చ. 3: బలుపైన పొట్ట మీఁది పాల చాఱల తోడ
నులి వేఁడి వెన్న దిన్న నోరి తోడ
చెలఁగి నేఁడిదె వచ్చి శ్రీ వేంకటాద్రిపై
నిలిచి లోకములెల్ల నిలిపిన శిశువూ

రేకు: 0042-2 భైరవి సంపుటం: 06-002

పల్లవి: ప్రాయంపు మదములే పరిణామము మతిఁ
బాయని రమణికి నీపై నెంతవలపో

చ. 1: తుమ్మిపూవుఁగొలనిలో తరుణులుందాము మిండ
తుమ్మెద లీఁదులాడంగ దొంగి చూచి
కొమ్మ నినుఁ గూడి కేళాకూళితోఁ గస్తూరినీట
నిమ్ముల నోలలాడిన దెటువంటి వలపో

చ. 2: కొదమమావిపై గండుఁగోవిల లేఁజిగురాకు
ముదిత కందీఁగా ప్రేమమునఁదాఁజూచి
అదివొ యుప్పరిగెపై నాకుమడిచి నీ వీఁగా
వదనాన నందుకొనె వడి నెంత వలపో

చ. 3: నెయ్యంపుఁ జకోరము వెన్నెల రస మింతినోర
నొయ్యనె కుమ్మరించంగ నువిదచూచి
కయ్యంపుంగూటమిని వేంకటేశుండ తమ్మరస
మియ్యంగఁ జొక్కితివి నీ విపుడెంతవలపో?

రేకు: 0042-3 ముఖారి సంపుటం: 06-003

పల్లవి: రమణి నేర్పు నేరములాయె
జమళివిధుల సరసపు విభుఁడా

చ. 1: తెఱవకు నంపిన తెల్లని కలువలు
మఱపున కెందామర లాయె
నెఱుఁగము నీవిపు డింతచేతువని
కఱతలకలికివి గా విభుఁడా

చ. 2: మగువకు నంపిన మకరంద మిచ్చటి
జిగి దొలంకేటి చిఱుచేఁదాయె
అగు నీ యెకసక్యమ్ముల మాటల
వగ నెఱజాణండవా విభుఁడా

చ. 3: చెంతల ముత్యపుం జిప్పల తోయము
లంతలోనె ముత్యములాయె
సంతత కరుణా జలనిధి లక్ష్మీ
కాంతుఁడవఁట వేంకట విభుఁడా

రేకు: 0042-4 కాంబోజి సంపుటం: 06-004

పల్లవి: ఆరగింపవో మాయప్ప యివే
పేరిన నేతులు పెరుగులును

చ. 1: తేనెలు జున్నులు తెంకాయ పాలును
ఆనవాలు వెన్నట్లును
నూనె బూరెలును నురుగులు వడలును
పానకములు బహు ఫలములును

చ. 2: పరమాన్నంబులు పంచదారలును
అరిసెలు గారెలు నవుగులును
కరజికాయలును ఖండమండెఁగలు
పరి పరి విధముల భక్ష్యములు

చ. 3: కడు మధురంబగు కమ్మఁబూరణపుఁ
గుడుములు నిడ్డెన కుడుములును
సుడిగొనునప్పాలు సుకినప్పాలును
పొడి బెల్లముతోఁ బొరఁటుచును

చ. 4: కాయపు రుచులకు గనియగు మిరియపుఁ
గాయలు నేలకి కాయలును
పాయరానియంబాళపుఁగాయలు
నాయతమగు దధ్యన్నములు

చ. 5: ఒడికపుఁ గూరలు నొలుపుఁబప్పులును
అడియాలపు రాజాన్నములు
బడిబడిఁ గనకపుఁ బళ్లెరములతోఁ
గడు వేడుక వేంకటరమణా

రేకు: 0042-5 సామంతం సంపుటం: 06-005

పల్లవి: అల్లవాఁడెవో అతివరో కడు
పెల్లైన ముత్యాల పేరులవాఁడు

చ. 1: తెప్పమీద నున్న వాఁడు తెల్లని కన్నులవాఁడు
దుప్పటి కంకుమనీటఁ దొప్పందోఁగినాడు
పుప్పొడి మేనెల్లనిండఁ బూవులవేట్లాడి
కప్పురగందులనెల్లం గరఁగించినాఁడు

చ. 2: క్రుమ్ముడి జారిన వాఁడు కోమలి చిమ్మనం గ్రోవి
చిమ్మెడి పన్నీట మోము చెమరించువాఁడు
కమ్మని కస్తూరి బొట్టు కరఁగిచెదర కను
దమ్ముల నలుపు చూపు దైవాఱువాఁడు

చ. 3: మంచి మంచి మణులు దాపించిన గద్దియ మీఁద
అంచగమనలుం దాను నాట చూచువాఁడు
మించిన కోనేటివాఁడు మెరసి వైభవముల
నెంచంగల తిరువేంకటేశుండనువాఁడు

రేకు: 0042-6 శంకరాభరణం సంపుటం: 06-006

పల్లవి: ఒక్కలాగువాఁడవా యోరి యిట్టి
తక్కులం బెట్టితి నన్నుఁ దగిలించి నీవు

చ. 1: తెలిసితిమిలే తెప్ప తిరుణాళ్లనాఁటి
జలముల నామీఁద జల్లుతానే
సొలపుం జూపుల నిట్టె సొంపుగఁ జూచి చూచి
వలపు జల్లితివి యెవ్వతె పైనోరి

చ. 2: కంటిమి నీలాగుగ్రక్కనఁ దిరువీథుల
నింటి ముంగిటను నీ వేఁగుతానే
వెంటనె యాలవట్టము విసరేటి సతి గుబ్బ
చంటిమీఁద నొరగి వేసాలఁ బోతివో

చ. 3: ఇన్నియు మెచ్చితిరా నిన్నింతలోనె యిప్పుడు నీ
వున్న పైఁడియుయ్యాల నీ వూగుతానే
మన్నవ కౌఁగిట నన్ను మరపించి యెక్కడికొ
కన్నులార్చితివి వేంకటరాయ యోరి

రేకు: 0043-1 శంకరాభరణం సంపుటం: 06-007

పల్లవి: అతను సంపదకంటె నసదా చెలిరూపు
మతిచింతచేత వేమరు నలఁగెఁ గాక

చ. 1: తగుఁ జందురుని నణఁచఁ దగదా చెలిమోము
వగలచే నొకయింత వాడెఁగాక
పగటుఁగోవెల మించి పాఱదా సతి పలుకు
జగడమునఁ బతిఁబాసి సన్నగిలెఁ గాక

చ. 2: కదలు గందపు గాలి గా(వ?)దా చెలియూర్పు
కదిమేటి మదనాగ్నిఁగ్రాఁగెఁ గాక
కొదమ తుమ్మెదగమికిఁ గొఱఁతా చెలితురుము
చెదరి మరుబాణముల చే జాఱెఁగాక

చ. 3: లీలఁబన్నీటికిని లేఁతా చెలి చెమట
లోలిఁ బూఁబానుపున నుడికెఁగాక
యేలచిగురునకంటె నెరవా చెలిమోవి
గేలి వేంకట విభుఁడు గీలించెఁగాక

రేకు: 0043-2 శ్రీరాగం సంపుటం: 06-008

పల్లవి: ఒప్పదువోయింత కొరపులం జూఁడేవు నా
నొప్పులెఱుంగవు యింత నొగిలించే వేలరా

చ. 1: తెల్లని కన్నుఁ గొన తీగె మెఱుపుల చూపు
చల్లకునే నాగుండె జల్లనీని
మెల్లని సొలపుల మెత్తనిమాటలకు నే
దల్లడించఁగానె యింతతాఁక నాడే వేలరా

చ. 2: పూఁచిన యొఱుపుల బొమ్మముడిజంకెనల
లోఁచకువే మనసు చిల్లులువోయీని
దాఁచిన నీ చిత్తపు బిత్తరపుటానలు నాపై
చాఁచి చాఁచి పలుమారు చంపంజూచేవేలరా

చ. 3: చిమ్ముల మురిపెపుఁ జిఱు నవ్వులనే నన్నుఁ
గ్రుమ్మకువే మనసెల్ల గొల్లంబోయీని
దిమ్మరిజాణఁడవోరి తిరువేంకటేశ నన్ను
క్రమ్మరఁ గ్రమ్మరఁ గూడి కాఁకరించేవేలరా

రేకు: 0043-3 శ్రీరాగం-ఏకతాళి సంపుటం: 06-009

పల్లవి: తొల్లిటివలెఁ గావు తుమ్మెదా యింక
నొల్లవుగా మమ్మునో తుమ్మెదా

చ. 1: తోరంపు రచనల తుమ్మెదా కడుఁ
దూరేవు గొందులే తుమ్మెదా
దూరిన నెఱఁగవు తుమ్మెదా మమ్ము
నోరగఁజూడకువో వో తుమ్మెదా

చ. 2: తొలు ప్రాయపు మిండ తుమ్మెదా కడుఁ
దొలిచేవు చేఁగలే తుమ్మెదా
తొలుకరి మెఱుఁగనే తుమ్మెదా యింక
నులికేవు మముఁగని వో వోతుమ్మెదా

చ. 3: దొరవు వేంకటగిరి తుమ్మెదా మా
తురు మేల చెనకేవు తుమ్మెదా
దొరకె నీ చనవులు తుమ్మెదా యింక
నొరు లెటింగిరి గదవో వో తుమ్మెదా

రేకు: 0043-4 శ్రీరాగం సంపుటం: 06-010

పల్లవి: చాలు నింక నిటువంటి సంసారము మరుని
పాలైతి నిపు డింటి భాగ్యమిది నాకు

చ. 1: తనియు కిటు నీవు గాంతల నెల్లనా యెదుట
గొనియాడ దొరకొంటి కొంకులేక
వినియుఁ బ్రాణము తోడ విషమైన యీకూడు
దినఁజేరినది యేఁటి దేహ మిది నాకు

చ. 2: వెఱవ కిటు సతుల నీ వెను వెంటఁ బెట్టుకొని
మెఱయ దొరకొంటివిది మేరలేక
యెఱిఁగియునుఁ దీపనుచు నిట్టి నీ మన్ననల
చెఱఁబెట్టినది యేఁటి జీవమిది నాకు

చ. 3: ఎక్కువగు నీతరుణు లిందరిని నాకిట్ల
మ్రొక్కించ దొరకొంటి మొఱఁగు లేక
గ్రక్కునను నన్ను వేంకటగిరీశ్వర కలసి
చిక్కనైతివి చాలుఁ జిన్నమిది నాకు

రేకు: 0043-5 సామంతం సంపుటం: 06-011

పల్లవి: చెలిదా మతి నీచెఱగాక
తలఁపగ నీకిది తగులైపోయె

చ. 1: తరుణీమణివా తమ్మికన్ను లివి
అరయ నెపుడు నీయవె కాక
నిరతపుఁజూపులు నీచెలువమునకే
యిరవై వనితకు నెరవైపోయె

చ. 2: మెలుఁతది గా దీమే నిటుకాఁకల
కలవఱచిన నీయదే కాక
పులకజొంపములఁ బ్రుంగు డగుచు నీ
యలుకల చెమటల కమ్ముడొవోయె

చ. 3: పంకజముఖివా బలుపుఁ గుచములు న
ఖాంకరుచుల నీయవే కాక
వేంకటేశ నీ వేడుక కౌఁగిట
నంకురించె నీవవునోకావో

రేకు: 0043-6 ఆహిరి సంపుటం: 06-012

పల్లవి: సతికి నిటువంటి రాజస మేల కలిగెనే
తతిగొన్న విరహాగ్ని ధరియించలేదు

చ. 1: తోరమగు భారంపు తురుమేల కలిగెనే
నారీమణికి మెఱుఁగు నళినముఖికి
వైరంపు మరుని నెవ్వగల బాణాగ్నిచే
జారఁగా పలుమారు సవరించ లేదు

చ. 2: వెలఁదికి జఘనంపుఁ వ్రేఁగేల కలిగెనే
కలహంస గమనమునఁ గదల లేదు
నలికంపు నడుము సన్నమున నవకపు మణుల
మొలనూలు జారఁగా మోపనే లేదు

చ. 3: ఇంతికిని చక్కఁదన మింతేల కలిగెనే
వంతఁ బొరలించు యౌవన మదమున
ఇంత లోననె వేంకటేశు కౌఁగిటఁగలసి
మంతనపుఁ బరవశము మతిఁ దెలియలేదు

రేకు: 0044-1 బౌళి సంపుటం: 06-013

పల్లవి: కనుమూసెఁగదె దీని గరువంపుఁ దెలివి
చనుదోయి పైకొంగు జారిన నెఱుఁగదు

చ. 1: తలకెక్కెఁగదె దీని తనువికారములు
పొలుపైన నెరులు కొప్పున జారెను
చలి ముంచెఁగదె దీని జవ్వనపు మదము
పులకజొంపములచేఁ బొరలెక్కె మేను

చ. 2: వడదాఁకెఁగదె దీని వాల్ గన్నుఁగొనలు
చిడుముడి ముచ్చటతో సిగ్గువడీని
బడిదప్పెఁ గదె దీని పలుకుఁదేనియలు
తడఁబాటుతోడ చిత్తము దాఁచెనిపుడు

చ. 3: కసరెక్కెఁగదె దీని కస్తూరి చెమట
అసలుఁ గుంకుమ తోడ నలరీని మేన
ఉసురెక్కెఁగదె దీని యొరుపు నూరుపుల
పొసఁగి వేంకటపతి పొందు దెలిపెడిని

రేకు: 0044-2 ఆహిరి సంపుటం: 06-014

పల్లవి: తొడరు నటువలెనే దొర కోపము
అడియాలమిటు సేసె నబ్బెఁగా బలిమి

చ. 1: తనుఁబాసినంతనే తరుణిఁ గడునేఁపెనని
వనజారి మీఁదఁ బ్రియవరుఁడు గూడి
కనలి కొనగోళ్లఁ దునుక లుసేసి జవరాలి
చను జక్కవలకొసగెఁ జాలదా బలిమి

చ. 2: కలికి కోమలికి చిలుకలు గండుఁ గోవిలలు
పలుకులనె వేఁచెనని ప్రాణ విభుండు
కెలపుఁ బలుకుల సన్నగిలఁ జేసి యలబలము
తలిరు మోవినె యేఁచె దక్కెఁగా బలిమి

చ. 3: మతినుండి చిత్తజుఁడు మగువ గారించెనని
పతి వేంకటేశ్వరుఁడు పడతిఁ గదిసి
ప్రతిలేని మనసెల్లఁ బరవశము చేసి మరు
నతివ కన్నుల నించె నదియపో బలిమి

రేకు: 0044-3 ఆహిరి సంపుటం: 06-015

పల్లవి: పచ్చి కస్తురి నీకు బ్రాంతిగాని
ఒచ్చెమని పూయ నొల్లమి దెన్నఁడును

చ. 1: తట్టుపునుఁ గొడల నంతటా నలంది
దిట్టవై పరిమళానఁ దిరిగేవు
ఇట్టిది మాయడవిలో నింతా నిదే
ఒట్టి యుండు నే మొల్ల మిదెన్నఁడును

చ. 2: కప్పురపుఁ దావి తోడఁ గదియుచు
చిప్పిలెటి చెమటలఁ జెలంగేవు
తప్పక యింటింట దీని తరువులే నే
మెప్పుడు మాచేత నంట మిదెన్నఁడును

చ. 3: జవ్వాది శిరసు నిండఁ జమరుకా యిట్టె
పవ్వళించే విదె నాపక్కనీవు
రవ్వయిన వేంకటరమణుఁడా మే
మెవ్వరమూ దీని నెఱుఁగ మెన్నఁడును

రేకు: 0044-4 కాంబోది సంపుటం: 06-016

పల్లవి: వలపుల దాడి వచ్చె వనితలారా మరుం
డెలగో లేయంగఁ జొచ్చె నేలాగే

చ. 1: తూరుపునం బొడిచెఁ జందురుఁడు మిన్నుల మోవ
పాఱుతెంచె విరహుల బందికాఁడు
గోరపు వెన్నెల వెల్లి గొని మీఁదమీఁద నిప్పు
లేటై పారఁగఁజొచ్చె నెందు చొత్తమే

చ. 2: చందనపుఁ గొండ వంక చల్లగాలి తుదముట్టి
ముందు ముందె కదిసె దుమ్ములు లేవఁగా
మందమై పన్నీటి సోన మందు చల్లె నమ్ములై
యెందు చూచినఁ దానె యేమి సేతమె

చ. 3: క్రొచ్చి పారె గుబ్బచన్నుఁ గొండల చెమ్మటనీరు
రొచ్చుగం గరి దరులు జారఁగా
పచ్చిగా వేంకటగిరి పతి యింతిఁ గూడఁగాను
ఇచ్చకాలె గనమాయె నింక నేఁటిదే

రేకు: 0044-5 సామంతం సంపుటం: 06-017

పల్లవి: వలదన నొరులకు వసమటవే
తలఁచినట్ల నిది దైవమే చేసె

చ. 1: తరుణి కుచములను తామర మొగుడలు
విరిసీనోయని వెరపునను
సరగునఁ బతి నఖ చంద్రశకలములు
దరులఁ గలుగ నివి దైవమె చేసె

చ. 2: పొలఁతి వదనమును పున్నమ చంద్రుఁడు
బలిమి నెగయునని భయమునను
మెలఁత చికుర ధమ్మిల్లపు రాహువు
తలఁ జెదరఁగ నిది దైవమే సేసె

చ. 3: వనితకు వాడునొ వలపు తాపమున
తనులతికయనుచుఁ దమకమున
ఘన వేంకటపతి కౌఁగిట చెమటలఁ
దనివి దీర్చనిది దైవమె సేసె

రేకు: 0044-6 ఆహిరి సంపుటం: 06-018

పల్లవి: విన్నవించఁగరాదు విచ్చేయు మనరాదు
అన్ని విన్నపములు అవియె యివియు

చ. 1: తూఁగు మంచముమీఁద తొయ్యలి పవ్వళించి
వ్రేఁగైన తురు మరవీడఁగాను
కాఁగిన మేనితో కన్నుఁ దమ్ముల నీ
రాఁగియాడిన మాట లవియె యివియు

చ. 2: గొప్పలయిన చనుఁగొండలా పైపైనె
చిప్పిలు చెమ్మట చిందఁగాను
చెప్పక చెప్పుచు చెలి తడంబాటుతో
నప్పుడాడిన మాట లవియె యివియు

చ. 3: నీవి చెఱఁగు జారి నెలఁత నీ కౌఁగిట
కావిక న్నులతోడఁ గరఁగుచును
శ్రీ వేంకటేశ్వర చెలరేఁగి నివ్వెర
గై వెనుకఁదలంచె నవియె యివియు

రేకు: 0045-1 ఆహిరి సంపుటం: 06-019

పల్లవి: సుదతి నీ కింతవంటా చూచెఁగాని
యెదనున్న నీతలం పెఱుఁగలేదాయె

చ. 1: తగులనాడితి వంటా తమక మందితి వంటా
నగితివంటా నింతి నమ్మెఁ గాని
జగడించి వేఱొక్క సతికి మోహము సేసి
తెగి తన్ను విడిచేది తెలియలేదాయె

చ. 2: కలలో వచ్చితివంటా కన్నుల మొక్కితివంటా
వెలఁది పువ్వుల బంతి వేసెఁ గాని
కలికి చేఁతల వట్టికాఁకలు వొడమించి
తలవంపిఁచేవని తలఁచలేదాయె

చ. 3: వేరుసేయ వంటా వేంకటపతి వంటా
కూరిమి గలవంటాఁ గూడెఁ గాని
నేరుపు మెరయించి నెలఁత నీ వెంతేని
ఊరడించినదాఁక నుండలేదాయె

రేకు: 0045-2 ఆహిరి సంపుటం: 06-020

పల్లవి: ఇంతగా జేసెఁగా యింతి కన్నుల నగవు
సంతరించగరాని చనుదోయి బిగువు

చ. 1: తనివి మాలిన తలఁపు తడవోరువని బులుపు
అనువెఱుంగని కెలపు అడియాసమెలపు
కనుఁగలువలో సొలపు కాఁకదీరని యలపు
వనిత చిత్తములోని వడిగొన్న వలపు

చ. 2: ఒడలెఱుంగని నెగులు నుల్లంబులోఁదగులు
వడియుఁగన్నీటిలో వగలు
పొడలువె ట్టెడి పొగులు పొందు వాసిన దిగులు
పడఁతికి నిది యెల్ల బరికించఁ బగులు

చ. 3: వెరవెఱుంగని పురపు వింతలాగులయొరపు
మిరుమిట్లు గొనుమేనిమెరుపు
తిరువేంకటాచలాధీశ్వరుని కనుగిరుపు
తరుణి కిటువంటి మెత్తని పూవుఁబరపు

రేకు: 0045-3 సౌరాష్ట్రం సంపుటం: 06-021

పల్లవి: ఈడేరని యట్టి వలపేఁటికమ్మా
యీడు జోడుగాని వలపేఁటికమ్మా

చ. 1: తనువు తనువు గూడి తమకము మీఁద మీఁద
నినుమడించని వలపేఁటికమ్మా
మనసు మనసు తోడ మక్కళించి సందు లేక
యెనసి వుండని వలపేఁటికమ్మా

చ. 2: మచ్చికల చేఁతల మతి లోలురై తా
మిచ్చ యెఱుఁగని వలపేఁటికమ్మా
తచ్చనయలుకలతో ధన్యత ప్రేమల
యెచ్చుకున్న యట్టి వలపేఁటికమ్మా

చ. 3: పంతము చెరిచి వాఁడు పానుపు మీదికి వచ్చి
యింత సేయ లేని వలపేఁటికమ్మా
కంతు నిఁకేలని శ్రీ వేంకటపతి నన్ను గూడె
నింత హెచ్చులేని వలపేఁటికమ్మా

రేకు: 0045-4 శుద్ధవసంతం సంపుటం: 06-022

పల్లవి: ఎంతమాయల వాఁడెంచి చూడఁగ వీఁడు
ఇంతి యీతని రూప మెవ్వరెఱుఁగుదురు

చ. 1: తెలుపు జలములలోన తెప్పవలెఁదేలీనే
తలఁకి పాతాళమున దాఁగియుండీనే
కెలసి తన కన్నులను కెంపువగాఁ జేసీనే
నెలఁత భీకరముగా నేఁడు నవ్వీనే

చ. 2: ఒరపుగా భూదాన మొకరిఁదా నడిగీనే
తరుణి భూమొక్కరికి ధారవోసీనే
మరలి పద్మజుని మనుమనినైనఁ జంపీనే
పరచుఁదనమున వృథా పాలుమాలీనే

చ. 3: పలుమారు తన సిగ్గు బయటఁ బడవేసీనే
కలికితనమునఁ దాను గడవఁబాసీనే
వెలఁది వేంకటగిరి విభుఁడు నా కౌఁగిట
తొలఁగక చెమటలఁ దొప్పఁదోఁచీనే

రేకు: 0045-5 సౌరాష్ట్రం సంపుటం: 06-023

పల్లవి: ఎట్టుగడియించె నమ్మ యీవలపు
పుట్టించి నటువంటి పూఁటకాఁపు మరుండు

చ. 1: తడఁబాటు నాలికకు తలఁకు మానంబునకు
నొడఁబాటు మఱపులకు నుదుటుఁ దలఁపులకు
కడువేడుకలు కోరికలకు భయ మాసలకు
బెడిదంపుఁ గోపంబు బిత్తరి చూపులకు

చ. 2: అతిముదము చింతకును అలపు గర్వంబునకు
మితిలేని తాపంబు మెత్తని తనువునకు
రతి గమ్మచెమటలకు రచన విరహంబునకు
ధృతి లేమి మనసునకు గతి గమనమునకు

చ. 3: కురులు నెన్నుదుటికిని గుఱుతు లధరంబునకు
మురిపెంపుఁ జిఱునగవు ముద్దుమోమునకుఁ
దిరమైన వేడుకలు తిరువేంకటేశునకుఁ
బరిణాపు మాటలివి పడఁతు లిందఱికి

రేకు: 0045-6 ముఖారి సంపుటం: 06-024

పల్లవి: అహో సాధు తవాగమనం
బహుళవైభవైః ప్రతివచనైః కిమ్

చ. 1: తతోపసర మిథ్యాశరవచనై
రితస్తవైమ మ హితం కిమ్
బత మమ దేహోత్ప్రాణ స్తథాపి
గత ఏవై తత్ కారణమిహ కిమ్

చ. 2: సంవృతి చేలం జహి చపల త్వం
సంవాదేమే సతతం కిమ్
త్వం వా మమ చిత్తం సాంత్వయసి
కిం వా కురు మమ ఖేలనమిహ కిమ్

చ. 3: అతి బిభేమి భవదాచరణాదిహ
చతుర వేంకటాచలరమణ
సతీం మా మనుసరసి కిమథం
రతిరాజవిభవ రచనమిదం కిమ్

రేకు: 0046-1 భూపాళం సంపుటం: 06-025

పల్లవి: విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా

చ. 1: తెల్లవారె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంతనింత నదివో వారె
చల్లని తమ్మిరేకుల సారస్యపుఁ గన్నులు
మెల్ల మెల్లనె విచ్చి మేలుకొనవేలయ్యా

చ. 2: గరుడకిన్నరయక్ష కామినులు గములై
విరహపు గీతముల వింతతాళాల
పరిపరివిధములం బాడేరు రాగాల నిన్నదివో
సిరిమొగము దెరచి చిత్తగించవేలయ్యా

చ. 3: పొంకపు శేషాదులు తుంబురు నారదాదులు
పంకజ భవాదులు నీ పాదాలు చేరి
అంకెల నున్నారు లేచి అలమేలుమంగను
వేంకటేశుఁడా రెప్పలు విచ్చి చూచి లేవయ్యా

రేకు: 0046-2 లలిత సంపుటం: 06-026

పల్లవి: ఎందరి వలపించెనో యంటనింట
చిందుల పాటలు వింట సిరులు చేకొంట

చ. 1: తుంగభద్ర యేటికాడ తోరమైనకొండనీడ
రంగుమీరి పైఁడి గోడ రాతిమేడ
అంగడి నున్నాఁడు చూడ నదివో పెడతల
చుంగుల పించెపు గూడ చుట్టు బాగతోడ

చ. 2: పండరంగినుండి వచ్చి పామరుల నెల్ల మెచ్చి
యెండలేని నీడలోన యెచ్చి యెచ్చి
వెండి బైఁడిఁదడంబడ విభవాలఁ బ్రొద్దు వుచ్చి
కొండనుచు వరములు కోరిక లిచ్చి

చ. 3: చక్కని యావిట్లలుండై జవ్వనానఁ జెలువుండై
ప్రక్క నున్న సతి తోడఁ బ్రబలుండై
మక్కువ వేంకటగిరి మాయధారి దేవుండై
యెక్కడా నెదురులేక యీడ నున్నాఁడిడివో

రేకు: 0046-3 సామంతం సంపుటం: 06-027

పల్లవి: తార వలచినయపుడె తరుణిరతుల
తారసము లెట్లుండు తగవు లెట్లుండు

చ. 1: తరితీపు లెట్లుండు తాలుము లెట్లుండు
గరువంబు లెట్లుండు కసరు లెట్లుండు
పొరపొచ్చె మెట్లుండు పొలయలుక లెట్లుండు
నెరవరిక లెట్లుండు నెఱుక లెట్లుండు

చ. 2: ఓపికలు నెట్లుండు నొల్లములు నెట్లుండు
చూపోప మెట్లుండు సొలపు లెట్లుండు
దాఁపరము లెట్లుండు తగుమాన మెట్లుండు
కోపంబు లెట్లుండు కొఱఁత లెట్లుండు

చ. 3: సిరిదొలఁకు లెట్లుండు శేషాద్రిపతికరుణ
కిరవైన సతి మనసు నెపుడు నెట్లుం
మురిపమది యెట్లుండు ముద్దుఁజనుగవమీద
నరచందురుని రేక లపుడెట్లులుండు

రేకు: 0046-4 మెంచబౌళి సంపుటం: 06-028

పల్లవి: నీకు నేల తమకము నీకు అలపు నేఁడు
నీకు వాఁడు మోహించి నీలోనె యుండఁగా

చ. 1: తొడవుగాఁ గమ్మని కస్తురిఁ బొట్టుగాఁబెట్టి
జెడలల్లి జవ్వాది శిరసుపై నంటి
విడువని విరహపు వెచ్చ మేన దైవాఱ
నిడువాలుఁ గనుదోయి నీరు నించ నేఁటికి

చ. 2: కొత్త ముత్యపు సరుల కుచ్చులు వీపున వ్రేల
నొత్తిలి చెక్కునఁ గర మూఁది మోమువంచి
లత్తుక మోవి గదల లలన నీచిన్నయెలుఁ
గెత్తి ప్రేమ దైవాఱ నెవ్వరిఁ బాడెదవే

చ. 3: కొండలరాయుఁడు వాఁడు కోనేటితిమ్మఁడు నీ
నిండిన చిత్తములోన నీవు దానై యుండఁగాఁ
గొండగొన్న సుఖమెల్లఁ గొల్లలాడుదువుగాక
బొండుమల్లె పానుపుపై బొరలఁగ నేఁటికే

రేకు: 0046-5 ముఖారి సంపుటం: 06-029

పల్లవి: నీకుఁ గాంతకుఁ దెలు నీవెఱుఁగు దది యెఱుఁగు
నీకడాకడవార లెవ్వ రెఱుఁగుదురు

చ. 1: తప్పకిటు నినుఁ జూచి తరుణి చనుఁగవమీఁదఁ
గప్పిన చెఱఁగువదలఁ గప్పనేఁటికిరా
చెప్పఁ జాలక పొలిఁతి చెలికరముఁదనకరము
నప్పళించుచు గోర నదిమె నేఁటికిరా

చ. 2: కాంత నీ చిరునవ్వు కనుఁగొనలఁ గని మనసు
వంత దెలుపక మొగము వంచ నేఁటికిరా
ఇంతి వేఁటొకతె నిను నెలయించఁగాఁ జూచి
యంతలో నవలిమొగ మాయె నేఁటికిరా

చ. 3: ఎలమిఁగైకొని వేంకటేశ! నీవాతరుణి
నలమి కౌఁగిటఁ జేర్ప నసమబాణములు
జలజాయతాక్షి విచ్చనవిడిని తను మఱచి
యలర నేర్పులు నెఱపదాయె నేఁటికిరా

రేకు: 0046-6 భైరవి సంపుటం: 06-030

పల్లవి: ఎంత సేసెఁబో దైవ మింతలోన నయ్యో
సంతపాకలంజవలె చల్లుఁ జూపు లేఁటికి

చ. 1: తల్లులు బిడ్డలు మందలలోన నిందఱును
చల్లలమ్మే చేసేరు సంసారాలు
చెల్లఁబో నీ వుంగరాల చేతుల గోళ్లువెంచి
గొల్లదానవై యింత కొప్పువెట్ట నేఁటికి

చ. 2: ఎడ్డలైన వారిఁ జూచి యిట్టిమన్న కులమని
సడ్డ సేయరిందఱును జరయఁగాను
ఒడ్డుఁ బొడవగు గుబ్బ లొరయుచుఁ గానరాఁగా
దొడ్డవారికిఁ బయ్యద తూల నింత యేఁటికి

చ. 3: ముంగిట నిధానములు ములుగంగ సొమ్ములతో
సంగడి గొల్లెతలెల్ల జడియఁగాను
అంగడివేంకటపతి నలమి పుట్టుక నీవు
చెంగలించి సొమ్ము గాఁగఁ జేసుకొంటి వేఁటికి

రేకు: 0047-1 నాదనామక్రియ సంపుటం: 06-031

పల్లవి: ఏగతి నోఁచెనో యిందువదన యీ
బాగులు ఖేదముఁ బాపెడిని

చ. 1: తొలఁకెడి జలములతోడికన్నుఁగవ
తలఁచి డెందము తలఁకీని
అలయుచుఁ జలితో నాడినమాటలు
పలికిన నామది భ్రమసీని

చ. 2: తొడరిన చెమటలఁ దోఁగిన పయ్యెద
పొడగని దేహము పొగిలీని
ఉడికెటి వ్రేఁకపుటూర్పుల వేఁడికి
నుడిగిన నాలుక నొగిలీని

చ. 3: కదిసిన తిరువేంకటపతి చేఁతలు
సుదతి విలాసము చూపెడిని
వదనము తావికి వలగొనుతేఁటుల
సదమద మగు రుతి చాటీని

రేకు: 0047-2 శ్రీరాగం సంపుటం: 06-032

పల్లవి: వేడుక కాఁడవై విడివడి తిరిగేవు తుమ్మెదరో
చూడఁ జూడఁగఁదొంటి చూపు దప్పకువయ్య తుమ్మెదరో

చ. 1: తలఁపుదామరలోన తావై యుండుదు నీవు తుమ్మెదరో
తలఁపఁగ నీవె తలఁప వైతివి మమ్ముఁదుమ్మెదరో
పొలయఁ గమ్మని తావి పొందునఁ దిరిగేవు తుమ్మెదరో
పొలసినీ తిరిగేటి పొందులెఱుంగుదుము తుమ్మెదరో

చ. 2: పచ్చని విలుకాని బంటవైతివిగద తుమ్మెదరో
మచ్చిక తలఁపులు మనలోనె సరివోలు తుమ్మెదరో
అచ్చపుదీమస మందరి కెక్కుడిదయ్య తుమ్మెదరో
చిచ్చువటి వెన్నెల చెలిమి సేయకువయ్య తుమ్మెదరో

చ. 3: తిరువేంకటాద్రిపైఁ దిరమై నిలిచినట్టి తుమ్మెదరో
పరమయోగుల పూలఁ బరిమళములు గొన్న తుమ్మెదరో
కరుణించి మామీఁదఁగలిగిన యీప్రేమ తుమ్మెదరో
ఇరవాయె నిటువలె నెలసివుండంగదవె తుమ్మెదరో

రేకు: 0047-3 సామంతం సంపుటం: 06-033

పల్లవి: గుబ్బచన్నుఁగవ లెల్ల గుబ్బలి కొండలు మంచి
గబ్బితనములె కన్నుగానని వలపులు

చ. 1: తేనియల చెలమలు తియ్యనిమోవులు మించు
లైనయమృతపుఁబిళ్ల లాననపద్మములు
మానైన చక్కెర బొమ్మలు మేనుదీగెలు
లేనగవు మెఱుఁగులు లేఁతవెన్నెలలు

చ. 2: సానఁ బట్టిన తూపులు చక్కని చూపులు మంచి
వేనలి కమ్మని తావులానిన తుమ్మెదలు
చేనిపంటల కొల్చులు చెప్పరాని చెయ్దులు
మానమానని చింతలు మాటలలో మూఁటలు

చ. 3: వెలలేని రచనలు వేడుక చేఁతలు వట్టి
పొలయలుకలు ప్రొద్దువోని బూటకములు
ఎలమితోఁ దిరువేంకటేశుని బొందినయట్టి
చెలియ గర్వము నేఁడు చెప్పఁజూపఁగతులు

రేకు: 0047-4 ముఖారి సంపుటం: 06-034

పల్లవి: చూపు లోపలి చూపు చూడకుర వోరి నీ
పైపూఁత చూపులకుఁ బాలైతి మోరి

చ. 1: తనువెల్లఁ గడువేఁడి దగ్గరకు రోరి నీ
యనుభవనచేఁ దమక మారదా వోరి
వెన్నుకొన్న నిట్టూర్పు విడువవలె నోరి నీ
మనసు మదనానలము మానదా వోరి

చ. 2: ఉదుటైన కళలతో నున్నాఁడవోరి నినుఁ
గదియఁ జూచిన యింతి కలికిరా వోరి
వెదచల్లు నగవులకు వెరతుమిదె వోరి రతి
సదమదము కాటింత చాలదా వోరి

చ. 3: వేవేలు సతులతో విహరింతు వోరినేఁడు
రావలసి నీ కింద్దురాఁ దీరెనా వోరి
ఆవేళలా మమతలవి యెఱుంగుదొరి నీకు
శ్రీవేంకటేశ్వరుఁడ చెల్లురా వోరి

రేకు: 0047-5 ఆహిరి సంపుటం: 06-035

పల్లవి: ఏమి సేయఁగ వచ్చు నిట్టుండు భాగ్యవశ
మామనియుఁ దాఁ గూడెఁ నక్కటా చెలికి

చ. 1: తుడువరే కమ్మఁ గస్తురి బొట్టు నొస లెల్ల
కడుఁ గ్రాఁగి పొక్కె నదె కటకటా చెలికి
కడుగరే శిర సెల్లఁ గ్రాఁగి జవ్వాదిచే
జెడగట్టె ముంగురులు చెల్లఁబో చెలికి

చ. 2: తియ్యరే నునుఁగౌనుఁ దీగ యొడ్డాణంబు
నొయ్యనె యిఁకనైన నొప్పదీ చెలికి
ముయ్యరే కుచకుంభములు బయలు పడకుండ
పయ్యదయు సవరించ భారమీ చెలికి

చ. 3: చూపరే నాయకుని సుదతికి మేనెల్ల
ఆపసోపము రేఁగె నద్దిరా చెలికి
ఏపుమీఱఁగ వేంకటేశు డింతట వచ్చి
తాప మింతయు మాన్పి దక్కఁగాఁజెలికి

రేకు: 0047-6 శంకరాభరణం సంపుటం: 06-036

పల్లవి: మచ్చికల మఱపులకు మదనబాధల మేను
వెచ్చినా నేమిటను విడువదీబాధ

చ. 1: తను వయో మదమునకుఁ దమకములచే బాధ
గొనకొన్న తమికి రతికోర్కి బాధ
అనుభవనరతికిఁ బాయని ప్రేమముల బాధ
ఘనకూటమికి వియోగములచే బాధ

చ. 2: తటి విరహ వేదనకు తలపోఁతచే బాధ
పఱచుఁదలఁపులకుఁ దాపముల బాధ
తఱచు తాపంబులకుఁ దడఁబాటుచే బాధ
పటివోనినేర్పులకు పరవశము బాధ

చ. 3: అలరు సింగారముల కలపుఁ జెమటల బాధ
చెలియ చెమటకుఁ దావిచేతి బాధ
కలికితనములకు వేంకటవిభుని రతిఁ గూడి
కొలఁదికిని మిగులు సిగ్గులచేత బాధ

రేకు: 0048-1 రామక్రియ సంపుటం: 06-037

పల్లవి: వెఱవక యింత విన్న వించఁగలమా నీ
మొఱఁగులు మానర మొక్కేము నీకు

చ. 1: దేవతలిందఱు నీకుఁ దిరిగి తిరిగి మ్రొక్కి
దేవుండవు నిన్నుఁ దిట్ట వచ్చునా
గోవిందుఁడవైన నీకొయ్యతనాలకుఁ గడు
మోవనాడ వెఱతుము మొక్కేము నీకు

చ. 2: చెలువుగ నజుఁడు పూజించె నీపాదాలు
తొలఁగక కాల నేఁ ద్రొక్క వచ్చునా
కలికితనముల వికారపుచేతల నా
మొలనూలు వట్టకురా మొక్కేము నీకు

చ. 3: ఒక్కటై శ్రీసతిఁ బాయకుండ నీవురమున
మొక్కలపు నాగుబ్బలు మోవ వచ్చునా
చక్కని వేంకటగిరిస్వామి నన్నుఁ గూడితివి
మ్రొక్కిన మొక్కుల మారు మ్రొక్కేము నీకు

రేకు: 0048-2 శ్రీరాగం సంపుటం: 06-038

పల్లవి: తనివి దీరక నన్ను తమకమున నెంతేని
చెనకేవు వద్దు నీ చిత్తమిఁక నోరి

చ. 1: దంటవై నాచేతఁ దలఁపించు కొనఁగ దొర
కొంటి వింక నిది నీకు కొలఁదిఁ బడునా
నంటున నా ప్రియము నాఁటిలను నిన్నునా
వెంట ద్రిప్పక నిన్ను విడుతునా వోరి

చ. 2: గబ్బివై నావాలుఁ గనుఁగొనల నవ్వులకు
నుబ్బేవు నీవు నీ వొడఁబడికల
నిబ్బరపు నావలపు నెలకొన్న యపుడేని
అబ్బురంబగు గర్వమణఁచనా వోరి

చ. 3: మెట్టుకొని నీవు నామెఱుఁగుఁ బయ్యద చెఱఁగు
పట్టేవు నీకు నీపరిణామమా
దిట్టవై కూడితివి తిరువేంకటేశ్వరుఁడ
యిట్టట్టు నిన్నుఁ బోనిత్తునా వోరి

రేకు: 0048-3 లలిత సంపుటం: 06-039

పల్లవి: బాల బొమ్మచారివి పట్టపువికారివి
ఓలినీ వెవ్వరిఁగన్నా నూరకుండేవా

చ. 1: దొంగిలి వెన్నలుఁ బాలు దొడికేటినీచేయి
ముంగిట నిధానమున్న మోసపోయీనా
చెంగట నిన్నెవ్వరైనాఁ జెనకి నవ్విననూ
అంగవించి కొనగోర నంటకుండేవా

చ. 2: సిగ్గరి గొల్లెతలపైఁ జిమ్మెడి నీ చూపు
బగ్గన నిచ్చన చోటఁ బారవేసేవా
దగ్గరి నిన్నెవ్వరైనాఁ దగులనాడిననూ
ఎగ్గెఱుఁగ కెందుకైనా నేఁగకుండేవా

చ. 3: కొమ్మల చీరలు దీసుకొని యున్న నీవూ
దిమ్మరి చేఁతల నిట్టె దిగఁ దోసేవా
క్రమ్మర నావలెనె వేంకటగిరి విభుండా
బిమ్మిటిగాఁ గూడి ప్రేమ పెంచకుండేవా

రేకు: 0048-4 సామంతం సంపుటం: 06-040

పల్లవి: విట్టలయ్య వీధికేఁగి వేగవచ్చెవో
కట్టుఁగాలు వలసొంపు గందువు గాని

చ. 1: దూపిలి నొచ్చితివి తొయ్యలి మెచ్చితివి
భూపతి చెరువు దాఁకాఁ బోయిరా రాధా
యేపు మీర నీఁదులాడి యింతుల నిం(ద్దరిఁ గూడి
వైపుగాఁగ మాపటెంత వత్తువు గాని

చ. 2: యెండ దాఁకితివి కడు నిచ్చల రచ్చలు సేసి
కొండచరిఁబొలమోరఁ గూరుచుంటివో
కొండలెక్కి కడునిక్కి కూరుముల నాకు దక్కి
బొండుమల్లెల తోఁటకుఁ బోదువుగాని

చ. 3: విజయనగరములో వీధుల వీధుల వెంట
భుజమురికలతోడఁ బొద్దువుచ్చెవో
త్రిజగములు నేలిన తిరువేంకటేశుండ
భజన నిలిచితి భూపతి చెరువుకాడను

రేకు: 0048-5 దేసాక్షి సంపుటం: 06-041

పల్లవి: ఇచ్చకపు మాటాలా యేతులాఁడా కడు
పచ్చిదేరే మే నెల్లఁబట్టకు నన్నింకనూ

చ. 1: దండగాఁగ మెడఁగుచ్చి తగిలించుకొంటివి
అండనుండే వారు చాల కాపె నొకతె
వెండియు నంతటఁ బోక వేగునంతకు నాడనే
పండి వచ్చితివి చాలు పట్టకు నన్నింకను

చ. 2: పొద్దు వొద్దునకు తలఁబూజించుకొంటివి
వద్దనక యాకెమీఁది వాఁడుఁబువ్వులూ
ముద్దు సేసి యాకె తావి ముక్కు వాయ నియ్యనీ
పద్దుల మాటలె చాలు పట్టకు నన్నింకను

చ. 3: చిందనీక యాకె మేని చెమటఁజెమ టెల్లను
పొందుగ నామీఁదం దెచ్చి పూసినాఁడవూ
కందుఁగాక మేని వేంకటగిరి విభుఁడ నీ
పందెపుఁ గూటమే చాలు పట్టకు నన్నింకను

రేకు: 0048-6 సామంతం సంపుటం: 06-042

పల్లవి: ఎంత మేలు చేసినదో యేమిచెప్ప చిత్త
మంతయు నీకిచ్చిన యొయ్యారి యెవ్వతెరా

చ. 1: దాడింబ పువ్వులవన్నె తళుకుఁబయ్యెద కొంగు
వేడుకతో వల్లెవాటు వేశి
గోడనిక్కి చూచి తనకొప్పు చెంగలువబంతి
నోడక వేసినయట్టి యొరపరెవ్వతెరా

చ. 2: కంకణాల మెఱఁగుల కరము లొయ్యన యిరు
వంకల చెలలుమీఁద వైచి
కొంకక తమలపాకు కొనవంక గఱచి నీ
వంక చూచి సన్న సేసె వనిత యెవ్వతెరా

చ. 3: పిక్కటిల్లునట్టి తన బిగువుఁజన్నుల కాంతి
వెక్కసమై యిరువంక వెడల
యెక్కువతోఁ దిరువేంకటేశుండ నిన్నుఁ గూడి
చెక్కునొక్కి కౌఁగిలించ్చె చిత్తిణి యెవ్వతెరా

రేకు: 0049-1 గౌళ సంపుటం: 06-043

పల్లవి: అల్లవాఁడే వాఁడల్లవాఁడే
యెల్ల లోకములకుఁ దానేలికైనవాఁడు

చ. 1: దొడ్డమేఁక పాలగూడు దోమటి దొడికినాఁడు
గడ్డువయసగు బిడ్డగన్నవాఁడు
నడ్డి ముక్కుతోడ వెట్టి నవ్వులు నవ్వినవాఁడు
అడ్డపాపఁడై యున్న ఆకుమీఁదివాఁడు

చ. 2: ఆలి యిల్లు బొడ్డుతోడ నంటఁగట్టుకొన్నవాఁడు
కోలలేక లోకమెల్లఁ గొలిచినాఁడు
కాలువగా మింటి నీరు కాలఁదన్ని తీసినాఁడు
నేలకింది పరపుపై నెలకొన్నవాఁడు

చ. 3: మించుల మించుల వన్నె మెకము నేసినవాఁడు
దంచేటి కైదువచేఁదనరువాఁడు
కంచముగా గొల్లవారి కడవలపాలెల్ల
వంచుకొని దోసిట వారవట్టువాఁడు

చ. 4: పోటుమీరిన యసురపురము లిన్నియుఁ జొచ్చి
వీటిబుచ్చి దుమ్ములుగా వేసినవాఁడు
బూటకపు సురలతోఁ బున్నమ కప్పురమున
కూటువగాఁ జాపకూడు గుడిచినవాఁడు

చ. 5: అల్లిందామరల పొందులైన కన్నులవాఁడు
తల్లిఁ గూఁతుఁ గౌఁగిటఁ దగిలినాఁడు
చల్లనైన వేంకట శైలముపై నున్న
నల్లని మేనివాఁడు నవ్వుమోమువాఁడు

రేకు: 0049-2 సామంతం సంపుటం: 06-044

పల్లవి: మనసునఁ బొడమిన కోపము మనసునకంటెనుఘనమఁట
మనసిజుఁడుద్బోధకుఁడఁట మాటల పని యేల

చ. 1: దవ్వుల కొండల పవనుఁడు తనుతాప ప్రేరకుఁడట
నవ్వులఁ బుట్టిన చూపులు నాటెడి యమ్ములఁటా
పువ్వులు సోఁకిన యంతనే పొక్కెడునఁట దేహంబులు
యెవ్వఁడెఱుంగును ఈవిధమేమని చెప్పుదమూ

చ. 2: చక్కఁదనములఁట గుండెలు జల్లనం జేయఁగలవఁట
మక్కువలఁట దేహంబులు మరవఁగఁ జేయునఁటా
కిక్కిఱిసిన తమకంబులు క్రిందును మీఁదు నెఱుఁగవఁట
టెక్కల పులుగుల పలుకులు తేఁపెడువుండ్లఁటా

చ. 3: సంతసములుఁ జతురతలును సౌభాగ్యవిలాసములును
మంతనములు మోహంబులు మందులసంచులటా
యింతటికిని తగుమూలం బివేంకటవిభుఁడట
యింతి తలంపునఁ గలుగుట లేఁక నెన్నఁగనేలా

రేకు: 0049-3 కన్నడగౌళ సంపుటం: 06-045

పల్లవి: హరి రసమవిహారి సతు
సరసోయం మమ శ్రమసంహారీ

చ. 1: దయానివృతతనుధారీ సం
శయాతిశయసంచారీ
కయా పృజితవికారీ
క్రియావిముఖ కృపాణధారీ

చ. 2: సదా మిథ్యాజ్ఞానీ స తు
మదాలి మతాభిమానీ
తదాశ్రితసంధానీ స తు
తదా తదా చింతాశయనాని

చ. 3: పరామృతం సంపాదీ
స్థిరానందాస్వేదీ
వరాలాపవివాదీ శ్రీ
తిరువేంకటగిరి దివ్యవినోదీ

రేకు: 0049-4 సామంతం సంపుటం: 06-046

పల్లవి: తత్తా తిగుడి దింధి తక దింధిం
తిత్తి తిత్తితి తితి తితి తితి

చ. 1: దానవవదనవితానదాన సం
ధాన రుధిరనిజపానమిదం
నానా భూతగణానాం గానం
దీనజనానాం తిత్తితి తితి

చ. 2: విమతదనుజమత విభవ పరిభవిత
సమధికం తవ శౌర్యమిదం
ప్రమదా భవ్యం ప్రమదాభరణం
తిమిరనిరసనం తిత్తితి తితి

చ. 3: తిరువేంకటగిరి దేవనిధానం
పరమామృతరసభాగ్యం మిదం
కరుణావరణం కమలాఘటనం
తిరొ తిరొ తిత్తితి తితి తితి

రేకు: 0049-5 నాట సంపుటం: 06-047

పల్లవి: తిరొ తిరొ జవరాల తిత్తి తిత్తి యీ
తరలమైన నీత(తా?)రహార మదురే

చ. 1: ధిమి ధిమ్కి తోంగ తోంగ దిద్ధిమిక్కి ఆరే
మమారే పాత్రరావు మజ్జా మజ్జా
కమలనాభుని తమకపుటింతి! నీకు
నమరెఁదీరుపు ఇదే అవధరించఁగదో

చ. 2: ఝుకజక్క జంఝుం ఝుణణకిణాని
ప్రకటపు మురువొప్పె భళాభళా
సకలపతికి సరసపుగొమ్మా నీ
మొకసిరి మెరసె చిమ్ముల మురిపెములా

చ. 3: మాయిమాయి యలమేలుమంగ నాచ్చారి మతిఁ
బాయని వేంకటపతి పట్టపురాణి
మ్రోయఁ జిరుగజ్జెలా నీ మ్రోత లానేని
సోయగమైన నీ సొలపుం జూ పమరే

రేకు: 0049-6 శ్రీరాగం సంపుటం: 06-048

పల్లవి: అతిశోభితేయం రాధా నతతవిలాసవశా రాధా

 చ. 1: దప కబలబోధా రాధా తపణ గంధవిధా రాధా దప్ప
యుతక్రోధా రాదా దప్ప కరసవేధా రాధా

చ. 2: తారితావరోధా రాధా తారుణ్యోద్బోధా రాధా
ధారితానురోధా రాధా దారితాపరాధా రాధా

 చ. 3: తరుణీమరుగాథా రాధా ధరసమకుచబాధా రాధా
తరుణసదనుబోధా రాధా ధరణిదుస్సాధా రాధా

 చ. 4: తనుభవగురుగాథా రాధా స్తనకృతగిరిరోధా రాధా
తనువరవచనసుధా రాధా ధ్వనిజితపికమేధా రాధా

 చ. 5: తరుణసఖీసవిధా రాధా దరశశిరుచిసౌధా రాధా
తరళితతటిద్విధా రాధా దరహసనవరోధా రాధా

 చ. 6: ధనగర్వ నిషేధా రాధా స్తవతత్పరవిభుధా రాధా
ద్రవధునీకృతసుధా రాధా దవమదనవ్యాధా రాధా

 చ. 7: తరుణత్వ పురోధా రాధా తరుణస్మరయోధా రాధా
తరుపశుమణిగుణధారక బహుల వి తరణపరా బహుధా రాధా

చ.8: దైవికసుఖోపధా రాధా ద్రావకనిజాభిధా రాధా
శ్రీవేంకటగిరిదేవకృపాముదావైభవ నాథా రాధా

రేకు: 0050-1 ముఖారి సంపుటం: 06-049

పల్లవి: ఏమి సోద్యం బిదియు నెన్న నాశ్చర్యంబు
కామాతురులకుఁ జీఁకటి వెన్నెలాయె

చ. 1: ధవళమగుకలుహారదళ నఖంబులచేత
యువతి కుచగిరులఁజంద్రోదయం బాయె
తివిరి ముఖచందురుని తెలివి యౌవనసుధా
ర్ణవమునకు సురతమధనంబు ఘనమాయె

చ. 2: తొడరి నవఘమ బిందువుల వానలు గురియుఁ
గడఁగి కచనీల మేఘము గారుక్రమ్మె
విడువ కిటుసంతసపు వెల్లి పై పై నిగుడ
కడిది నిట్టూర్పుఁ సురగాలి వీతెంచె

చ. 3: తలకొన్న సాత్త్వికోదయముచేఁ బరవశం
బలమి సౌఖ్యములు దెలివి పడదాయె
వలచి తిరువేంకటేశ్వరునిం బొందిన మరుని
తలఁపు లన్నియును ముందర వెనుక లాయె

రేకు: 0050-2 ముఖారి సంపుటం: 06-050

పల్లవి: కొమ్మమనసు దెలియరాదు కోర కలరఁగోనేటి
తిమ్మని తలంపులెల్లఁ దెలియ నెవ్వరివసమురా

చ. 1: నిన్నుఁ దలఁచి పులకరించి నెలఁత చలి యటంచుఁజెలుల
కన్ను మొఱఁగి పయ్యద కొంగున కప్పు నొయ్యన దేహము
సన్నపుఁ జెమట నొసలఁ బొడమగన్నులు దేలగిలఁగఁజొక్కుచు
మిన్నక మదన మెత్తె ననుచు మెలుఁత తమ్ముల ముమియ

చ. 2: వెక్కసమైన యూపుఁ గముల వెల్లువ లొయ్యన నిలిపి నిలిపి
పుక్కిట నించి గుబ్బలమీఁద పొలయఁ జెమట లార్చును
మిక్కటమైన కన్నులనీరు మెఱుఁగు రెప్పలతుదలనాన
చుక్కలం జూతమనుచు లేచి సుదతిమాయలు నేసును

చ. 3: చెక్కిట నీవు సేసినముద్దుల చేఁతలు చెలుల కెల్ల మొఱఁగి
చెక్కునఁజెయి మోపుఁకొనుచు చెలియ యొయ్యనె గప్పుదు
యిక్కు వెఱింగి వేంకటాచలేంద్ర నీవు రమణిఁ గలసి
చొక్కపుఁజేఁతల నుల్ల మరసి చొక్కఁ జేసి తొదురా

రేకు: 0050-3 పాడి సంపుటం: 06-051

పల్లవి: రమ్మనవే మాని రచనలు తా
నెమ్మదిఁ గూడిన నేఁడే రేపు

చ. 1: నల్లని మేనికేలే నడురేయి తన
తెల్లని కన్నులకేలే తెల్లవాఱును
కల్లజంపులు సేసి కాఁకలఁ దా
బల్లిదుండై తేఁ బగలే రేయి

చ. 2: సిగ్గుల మోము కేలే చిఱునవ్వు తన
నిగ్గుల చూపులకేలే నెరసులు
దగ్గఱి యింకా నేలే తమకము తా
వెగ్గలము వలచిన వెలియే లోను

చ. 3: తావులమేనికేలే తాపము తన
కావులకన్నుల కేలే కనరులు
శ్రీవేంకటపతి చెలువుండిట్లే
కావలె నంటే కడయే నడుము

రేకు: 0050-4 శ్రీరాగం సంపుటం: 06-052

పల్లవి: కొల్లవలపులు చేకొనరాదా కడు
మెల్లని మాటాడరాదా మెకురేల సేయును

చ. 1: నిక్కి నిక్కి చూచెఁగా నీవంక నెవ్వతో
మొక్కిన ఱెప్పల నింపు ముంచిముంచి
ఇక్కడ నీవుండఁగాను ఎంత గోపించునో
గ్రక్కున విచ్చేయరాదా కడుఁ దడవాయెను

చ. 2: కన్ను సన్న జేసిన కలికి య దెవ్వతో
సన్నపు నవ్వులు నీపైఁ జల్లిచల్లి
ఎన్నరాని కాఁకలను ఏమిచేసునో నిన్ను
వన్నెలాఁడి నిను నింత వలపించుకొన్నది

చ. 3: కొప్పు గడు దీచి తనకొనగొళ్ల నెవ్వతో
చెప్పరానిసిగ్గు నీపైఁ జిమ్మి చిమ్మి
యిప్పడె శ్రీవేంకటేశ యింతిం గూడుకొంటి వౌర
యెప్పుడుఁ బాయక మమ్ము నిక్కడ నీవుండరా

రేకు: 0050-5 సామంతం సంపుటం: 06-053

పల్లవి: తగని మాటలేలె తలపోఁత లవి యేలె
తెగు వేలె యిటువంటి దిట్టతన మేలె

చ. 1: నున్నని చెమట లేలె నొసలఁ బట్టిదియేలె
చిన్నఁబోయియుండనేలె చెక్కిటఁ జేయేలె
విన్నని నగవు లేలే వెరగుఁజూ పిదియేలె
కన్నులఁ గోప మదేలె కాఁతాళమేలె

చ. 2: వ్రేఁకపుటూరుపు లేలె వెచ్చని మే నిదియేలె
తాఁకియుఁ దలఁచ వదేలే దప్పిదేర వదేలె
చీఁకటి ద్రవ్వెదవేలె చీఁజీనఁ బలుకవేలె
ఆఁకలిదడవవేలె అవలిమోమేలె

చ. 3: కొప్పు వదలిన దేలె గుబ్బలపై జీర లేలె
దప్పులు మోమున నేలె తడఁబాటు లేలె
చెప్పక దాఁచెదవేలె చెలియరో తిరువేంక
టప్పనిఁ గలసి మమ్ము నణఁకించె వేలె

రేకు: 0050-6 శ్రీరాగం సంపుటం: 06-054

పల్లవి: మగవాఁడు మాయకాఁడు యీ
జగడంపుం జనవులు సతములౌనాయమ్మ

చ. 1: నిండిన నీమది నాతఁడు నిజముగ
నుండంగానే ఉడికే వేలె
అండల యాసల నాఁకలా యిటువంటి
యెండ చూపులను దప్పులేల తీరునోయమ్మ

చ. 2: మందపు నవ్వుల నాతఁడు మాటలు
చిందంగానే చిమిడే వేలె
అందియు నందని యాసల నిటువంటి
చందమామగుటకలు సతము లవునా యమ్మ

చ. 3: కలికి వేంకటరాయఁడూ కౌఁగిట
నలరంగానే అలసేవేలె
చెలువఁ డాతతి చేఁతల నిటువంటి
తొలు మించు మెఱుఁగులు తొడవులౌనాయమ్మ

రేకు: 0051-1 శుద్ధవసంతం సంపుటం: 06-055

పల్లవి: లోనివారి మొఱఁగేటి లోకదొంగవు కనిం
గానన‌ట్టె రాకు మామంగారు వినేరు

చ. 1: వడికి రేయివచ్చి నాతోడనే కడు
వెడమాటలాడేవు వేసదారివి
కడఁగి యిందాఁకా నెక్కడనుంటివో మాట
కడునాడకుర మామంగారు వినేరు

చ. 2: తొట్టెల పాపఁడ వింతె తొడ్డవాఁడవూ చల
పట్టి నాతొడలమీఁదఁ బవ్వళించేవు
పట్టకుర నాచెలఁగు బలిమి నీవు మొల
కట్టురవములు మామంగారు వినేరు

చ. 3: పగ సాధించ వచ్చిన పంతగాఁడవూ ఈ
వగఁబట్టి మంచ మెక్కి వానిఁ జూసేవూ
నగకురా వేంకటనాథ నీవు మేను
గగురు పొడిచి మామంగారు వినేరు

రేకు: 0051-2 శంకరాభరణం సంపుటం: 06-056

పల్లవి: గుఱు తెఱిఁగిన దొంగ కూగూగు వీఁడె
గుడిలోనె దాఁగేని కూగూగు

చ. 1: నెలఁతల దోఁచేని నీళ్లాడఁగానె
కొలని దరిని దొంగ కూగూగు
బలువైనవుట్ల పాలారగించేని
కొలఁది మీఱిన దొంగ కూగూగు

చ. 2: చల్ల లమ్మంగ చనుకట్టు దొడికేని
గొల్లెతలను దొంగ కూగూగు
యిల్లిల్లు దప్పక యిందరి పాలిండ్లు
కొల్లలాడిన దొంగ కూగూగు

చ. 3: తాపుకొన్న దొంగఁ దగిలి పట్టుండిదె
గోవులలో దొంగ కూగూగు
శ్రీ వేంకటగిరి చెలువుండొ యేమొ
కోవిదుఁడగు దొంగ కూగూగూ

రేకు: 0051-3 నాదరామక్రియ సంపుటం: 06-057

పల్లవి: మనములోని విభుఁడు మఱవఁడే కాలంబు
నినుఁగలయునున్నాఁడు నీకేలె వెఱవ

చ. 1: నెలనాళ్లవాఁ డొకఁడు నిర్మలంబైన రె
న్నెలలవాఁ డొకఁడు మూన్నెలలవాఁ డొకఁడు
నెలలు పండ్రెండైన నిజబాలుఁ డొక్కండు
నెలఁత యింతటి పనికె నీకేలె వెఱవ

చ. 2: ప్రొద్దుపొడుపుల దొకటి ప్రొద్దు గ్రుంకుల దొకటి
ప్రొద్దువ్రొద్దులకు రహిపొయ్యేటి దొకటి
పొద్దెఱింగిన దొకటి పొద్దెఱుంగని దొకటి
నిద్దంపుఁ బువ్వులకు నీకేలె వెఱవ

చ. 3: నిండుఁ జంచల మొకటి నిమిషమాత్రము దొకటి
వుండి నట్లనె వుండి వుడి వోపునొకటి
కొండలలో నెలకొన్న కోనేటిరాయండు నీ
నిండుఁ గౌఁగిటఁ గూడె నీ కేలె వెఱవ

రేకు: 0051-4 సామంతం సంపుటం: 06-058

పల్లవి: యెన్ని మారులు యిట్టె నీపనులు
ఇన్ని మాయలు నన్ను నేఁచనేఁటికిరా

చ. 1: నీళ్లే నమలేవు నీలోనె సన్నల
వేళ్లే చూపేవు వెలుపలికి
పేళ్లె తప్పేవు బిరుసుగ నింతేసి
గోళ్ల రాచేవు కోపమేఁటికిరా

చ. 2: మేనె దాఁచేవు మెస్తిర గొడ్డలి
నానం బెట్టేవు నయమునినే
పోని తెరువుల పోకులఁ బోయేవు
కానిరా యేటివంకలు తిద్దవశమా

చ. 3: చేరి కపటాలె చేసేవు యింకనైనా
సారెం బరువులు చాలించరా
ధీరుండవుగాన తిరువేంకటపతి
కూరి మెజిఁగి నన్నుఁ గడితి విపుడూ

రేకు: 0051-5 ముఖారి సంపుటం: 06-059

పల్లవి: ఏడకేడ యెంతకెంత యెక్కడికి నెక్కడ నీ
తోడ నలుగఁగ నంత దొడ్డదాననా

చ. 1: నాకు నీకు నేమి వోదు నాఁడె నాఁటి కాయెఁబోయె
పోకుమంటా నాఁగేవు పొద్దువోదా
పైకొన చుట్టఱికానం బగ సాధించఁగ నీకు
లోకము లోపలను మెలుంతలు లేరా

చ. 2: నన్ను నేల చెనకేవు నా తెరువు నీకునేల
నున్నట్ల చక్కఁజూడ నుండరాదా
కన్నుల లేనగవుల కసరుల జంకెనల
సన్నలఁదిట్టఁగ నే నీ సరిదాననా

చ. 3: నాదెస యేమి చూచేవు నమ్మిక బాసలె చాలు
సేద దేర నేమైనాఁ జేయరాదా
ఆదరించి నన్ను వేంకటాద్రీశ కూడితివి
కాదన నీకంటె నేఁ జక్కని దాననా

రేకు: 0051-6 రామక్రియ సంపుటం: 06-060

పల్లవి: బిడ్డఁ డంటా నమ్మి యెట్టు వెట్టుకొన్నా రిందుకంటె
గొడ్డువో మేలు యిట్టి కొత్త లెందుఁగలవా

చ. 1: నోరినిండాఁ జన్ను లేక నొగిలెడిఁ బాప మయ్యో
ఊరివారిపాపఁ డఁటా నొకయింతి
నేరుపునం జన్నియ్యంగ నెత్తు రెల్లఁ దాగి తాగి
గోరపెట్టి చంపె నిట్టి కొత్త లెందుఁగలవా

చ. 2: ఎత్తుకొనేవారు లేక యేఁకరే నటంచు నొక్కఁ
డెత్తుకొని వేడుకతో నేఁగఁగానే
బత్తిగలవానివలె ప్రాణము వోయినదాఁకా
కుత్తుక బిగించె నిట్టి కొత్త లెందుఁగలవా

చ. 3: నిప్పు వలె నెండగాయ నీడలే దటంచుబండి
యొప్పుగం జాటిడి తనకుండంగానే
అప్పుడు వేంకటరాయఁ డడ్డపాపఁ డరకాల
కుప్పవడఁ దన్నె నిట్టి కొత్త లెందుఁగలవా

రేకు: 0052-1 శుద్ధదేశి సంపుటం: 06-061

పల్లవి: వెన్నెలల బయట వేడుకకాఁడ
యిన్నే సిలాగుల నెలయించితిగా వోరి

చ. 1: నగుతానె సారెసారె నాతో నీవింతేసి
పగటులు నెరుపేవు బాపురా
తెగి నిన్నుఁ జూడలేను తెమలకుండఁగలేను
సగము బీరము నాపైఁ జల్లితిగావోరి

చ. 2: నయమున నిట్లనె నన్నుఁ గడుఁ గరఁగించి
బయ లీఁదించం జూచేవు బాపురా
నియమించలేను నిన్ను నిమిష మెడయలేను
ప్రియము భయము నాపైఁ బెట్టితిగా వోరి

చ. 3: తక్కులనే పెట్టి పెట్టి తనివి దీరని నీ
పక్కఁబాయ నియ్యవైతి బాపురా
చక్కని వేంకటగిరిస్వామి నీపాదాలకే
మొక్కఁగానే యింపులు ముంచితిగావోరి

రేకు: 0052-2 ఆహిరి సంపుటం: 06-062

పల్లవి: ఎటువంటి బిడ్డండె యితఁడు
ఇటువంటి వయసుననె యిట్లఁజేసీని

చ. 1: నడుఁక కెటు నీటిలోననె యీఁదులాడేని
తడవి పట్టెదమనిన దాఁగిపోయీని
తడఁబడక నేలగుంతలువోవఁ దవ్వీని
కడపమీఁదనె వుండి కదలఁడెప్పుడును

చ. 2: కలిమిలే మెఱుంగఁడిదె కల వెల్ల నడిగీని
చలమ రెవ్వరినైనఁ జావ నడిచీని
అలయ కడవులవెంట నాటలకే తిరిగీని
తొలఁగకిటు గిరులెక్కి దుముకు లాడీని

చ. 3: విచ్చన విడినె తడువు విడిచి పారెడిని
రచ్చలనె యింత గుఱ్ఱము వంటికొడుకు
దిచ్చరీఁడై యిట్లు దిరువేంకటేశ్వరుండు
నిచ్చ నిచ్చలును గడుఁబెచ్చు వెరిగీని

రేకు: 0052-3 లలిత సంపుటం: 06-063

పల్లవి: బాలుండై రేపల్లె లోపల
నాలరియాటలె యాడెనే యితఁడు

చ. 1: నెలఁతల సన్నపు నెన్నుదుళ్లపై
నెలయింతలరతి నిలు గట్టి
కెలపుల నును జంకెనలనె కలయుచు
నలరి బొమ్మ పెండ్లాడెనె యితఁడు

చ. 2: గుబ్బల మెఱుఁగుల గురుగులలోపల
నుబ్బునానఁబాలొగి నించి
ఒబ్బిడి గాఁ బెదవులనే నమలుచు
నబ్బిన యాటలె యాడెనే యితఁడు

చ. 3: ఎప్పుడు నిటువలె నిండ్లు గట్టుక
కప్పుర గందులఁ గలయుచునూ
తెప్పలఁ దేలుచుఁ దిరువేంకటగిరి
యప్పఁడు మహిమల నాడెనె యితఁడు

రేకు: 0052-4 భైరవి సంపుటం: 06-064

పల్లవి: అమ్మమ్మ యేమమ్మ అలమేల్మంగ నాచారమ్మ
తమ్మి యింట నలరుకొమ్మా వోయమ్మా

చ. 1: నీరిలో నాఁదల్లడించి నీకే తలవంచి
నీరికిందాఁ బులకించి నీ రమణుండు
గోరికొనఁ జెమరించి గోపమే పచరించి
సారెకు నీయల కిట్టె చాలించవమ్మా

చ. 2: నీకుఁగానె చెయిజాఁచి నిండాఁ గోపమురేఁచి
మేకొని నీవిరహాన మేను వెంచేని
యీకడాకడి సతుల హృదయమే పెరరేఁచీ
నాకు మడిచియ్యనైనా నానతియ్యవమ్మా

చ. 3: చక్కఁదనములె పెంచి నకలముఁగాల దలంచి
నిక్కపు వేంకటేశుండు నీకె పొంచేని
మక్కువతో నలమేల్ మంగనాచారమ్మా నీ
యక్కున నాతని నిట్టె అలరించవమ్మా

రేకు: 0052-5 శ్రీరాగం సంపుటం: 06-065

పల్లవి: చిఱునవ్వు మెఱుఁగారు సిగ్గుల మోముతోడ
మరగె నిన్నలమేల్మంగ నాచారి

చ. 1: నిలువుఁదురుము మీఁది నెమలిపాదపుడాలు
తొలి మెఱుంగుల మించి దొలఁకఁగాను
అలరుచు నినుఁ జూచి అప్పుడె వెరగువడి
మలయుచు నలమేలుమంగ నాచారి

చ. 2: పరగునీమెడ సరపణులవుయ్యాలలో
ఉరుటు మురిపమున నూఁగుచును
గిరికొన్న తమకాన కిందుమీఁదెఱుఁగక
మరచె మే నలమేలు మంగనాచారి

చ. 3: కంచము గని మోవి కమ్మఁదేనే లారగించి
లంచముగఁ గస్తూరి లప్పలు రాల
యెంచఁగఁ దిరువేంకటేశుఁడు నీ పాఁపసజ్జ
మంచమెక్కె నలమేల్మంగనాచారి

రేకు: 0052-6 శంకరాభరణం సంపుటం: 06-066

పల్లవి: నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలె

చ. 1: నిలువుల నటనలు నీకేలే యీ
నిలుగుల నడపులు నీకేలే
నెలవులకరఁగులు నీకేలే యీ
కులికెటి నును సిగ్గులు నీకేలే

చ. 2: నెఱుల చెదరులివి నీకేలే యీ
నెఱవగు చదరులు నీకేలే
నెఱతనపుసరులు నీకేలే యిదె
చెఱఁగునమూసెదు చెలి నీకేలే

చ. 3: నిక్కపుఁబోఁకులు నీకేలే యిదె
నిక్కలగంటివి నీకేలే
నిక్కితి వొరపుల నీకేలే యిదె
దక్కె వేంకటోత్తముఁడు నీకేలే

రేకు: 0053-1 హిందోళవసంతం సంపుటం: 06-067

పల్లవి: నన్నేల యేఁచేరే నగుబాట్లు
అన్నింటా నాకె ఘనమై యుండుఁగాక

చ. 1: నాకేలె యీసింగారాలు నాకేలె యీనటనలు
ఆకడ నాతఁడు సుఖ మందఁగాను
కైకొనె నాతని చెంతఁ గల దెల్ల నా మనసు
ఆకె పట్టపు దేవు లై యుండుఁగాఁక

చ. 2: నేనేలె యాతనికి నేనేలె బాలకిని
ఊనిన సుఖమునందా నుండఁగాను
కానిక లాకె నవ్వులు కన్నులఁ బట్టఁగను
ఆనేరుపులే చవులై యుండుఁగాక

చ. 3: వద్దేలే నాతోడి పొందువద్దేలే తనకు
ఒద్దిక లక్కడం గలి గుండంగాను
గద్దిరియై కలసి వేంకట విభుండు
అద్దొ యింకా నన్ను నణకించుంగాక

రేకు: 0053-2 సామంతం సంపుటం: 06-068

పల్లవి: కస్తూరి వాట్లం గరంగేవు మైఁ
గస్తూరి నాతనిం గమ్మంగ రాదా

చ. 1: నీరు వసంతం నీపైఁజల్లిన
మారు కుమారు రమణి నీవు
సారపు నీరతి జవ్వాది చెమటల
నీరాతనిపై నించంగరాదా

చ. 2: పువ్వులు నీపై బొలుపుగఁ బోసిన
నెవ్వ దీఱఁగ నీవతని
రవ్వగు నీ వుపరతులఁ గూడి తల
పువ్వులతని దిగఁ బోయఁగ రాదా

చ. 3: పంకజమునఁ దాఁ బైకొని చేరి
వెంకటపతి నిను వేయఁగను
కొంకక నిరతింగూడి నీవు ముఖ
పంకజ మాతనిఁ బైకొనరాదా

రేకు: 0053-3 దేశాక్షి సంపుటం: 06-069

పల్లవి: మదవికారములు మానేవో, నా
యెదురనె నీవు నేఁ డింకాఁజేసేవో

చ. 1: నందవ్రజములోన నాఁడు నీవు గొల్ల
మందల మగువల మరగించినా
మందులుమాయలు మఱచితివో, యిప్పు
డిందూ నామీఁద నింకాఁ జేసేవో

చ. 2: నలినాప్తకులుఁడవైనాఁడు నీవు ఇంతిం
గలకాలమెల్ల నంగడిబెట్టినా
మలినపు మాటలు మఱచితివో నన్ను
నెలయించి కాఁకల నింకా సేపేవో

చ. 3: నరసింహుఁడవై నాఁడు నీవు పెక్కు
మురిపెంపు వికారములఁ బోయినా
తిరువేంకటేశ పొందితివి నన్ను నీ
యిర వైన యీ చేఁత లింకాఁ జేసేవో

రేకు: 0053-4 వరాళి-ఏకతాళి సంపుటం: 06-070

పల్లవి: ఇప్పుడిటు విభుఁ బాసి యింతలోననె నేఁడు
తప్పు లోపలి తప్పు దైవమా చెలికి

చ. 1: నగవు లోపలి యలపు నంపైన పొలయలుక
పగటు లోపలి వెరగు పచ్చివేఁడి
మొగము కాంతుల మెఱపు ముంచు నలకల చెదరు
పగలు చీఁకట్లాయె బాపురా చెలికి

చ. 2: బలిమి లోపలి భయము పలుకుఁదేనెల కనరు
చెలిమి లోపలి చేఁదుచింత చెలికి
బలుపుఁగుచముల లోని బట్టబయ లగు నడుము
కలిమి లోపలి లేమి కటకటా చెలికి

చ. 3: నిడుపు లోపలి కురుచ నీడలోపలియెండ
వడిమంచి తరువు విడువని తమకము
కడువేంకటేశ్వరుని కౌఁగిటను పరవశము
మడుఁగు లోపలి మైల మాన దీ చెలికి

రేకు: 0053-5 సామంతం సంపుటం: 06-071

పల్లవి: విరహపు రాజదె విడిదికి రాఁగా
సిరులఁ జేసె నిదె సింగారములూ

చ. 1: నెలఁత నుదుటిపై నీలపుఁగురులనె
తొలుతనె కట్టెను తోరణము
మొలకచెమటలనె ముత్యపు మ్రుగ్గులు
అలరిచె మదనుం డదె చెలిమేన

చ. 2: దట్టముగాఁ జింతాలతనే వడిఁ
బెట్టెఁ జప్పరము పెనఁగొనఁగ
పట్టినమైతావుల పరిమళములు
కట్టించెను చెంగట వలరాజు

చ. 3: విందగు వేంకట విభుని ప్రేమచేఁ
బొందుగఁ బెట్టెను బోనాలు
ఇందువదన కియిందిరావిభుని
కందుదేర నలుకలు చవిచేసె

రేకు: 0053-6 శ్రీరాగం సంపుటం: 06-072

పల్లవి: తెలియ దెవ్వరికిని దేవదేవేశ యీ
నెలఁత భావం బెల్ల నీవెఱుఁగు దిఁకనూ

చ. 1: నిలుచుఁ దలయూఁచుఁ గన్నీరు వాలిక గోళ్లఁ
జినుకు నివ్వెఱఁగుపడుఁ జింతించును
పులకించు నలయుఁ దలపోయు నినుఁ జిత్తమున
నిలువునంగన విధము నీ వెఱుఁగు దిఁకను

చ. 2: కమలంబు చెక్కుతోఁ గదియించు నెన్నుదుట
చెమటఁ బయ్యెదఁ దుడుచు సెలవినగును
తమకంపుఁగోరికలు తరుణి యిదె నినుఁబాసి
నిమిష మోర్వఁగలేదు నీ వెఱుఁగు దిఁకను

చ. 3: వెక్కసపు నునుదురుము వెడవదల నేరదు
చిక్కుదేరఁగఁ గొంతసిగ్గు వడును
ఇక్కువలఁ దిరువేంకటేశ నినుఁ గూడె నిదె
నిక్కమీ చెలివగల నీవెఱుఁగు దిఁకనూ

రేకు: 0054-1 పాడి సంపుటం: 06-073

పల్లవి: చింత లేమనుచుఁ జేసితివో
కాంతాళించియుఁ గదలదు మనసు

చ. 1: నిలువునఁ బులకలు నిండెను నామెయిఁ
దలపున నేమని తలఁచితివో
సొలసియు నినుఁ గడు సోఁకఁగ నాడఁగఁ
దలఁచియు నాలికఁ దగులదు మాట

చ. 2: తాపమె హృదయము దాఁకెం బయిపయి
చూపుల నేమని చూచితివో
కోపము కన్నులఁ గురిసి మోమున
నేపునఁ జిఱునగ వెడయదు నాకు

చ. 3: ఆఁగిన కుచముల నలసారఁగ నా
కౌఁగిట నేమని కలసితివో
రాఁగవు వేంకట రమణుని చెమటలఁ
దోఁగియు వేడుక దొలగదు నాకు

రేకు: 0054-2 సాళంగనాట సంపుటం: 06-074

పల్లవి: పలుకుఁదేనెల తల్లి పవళించెను
కలికితనముల విభునిఁ గలసినది గాన

చ. 1: నిగనిగని మోముపై నెఱులు గెలఁకులఁ జెదర
పగలైన దాఁకఁ జెలి పవళించెను
తెగని పరిణతులతోఁ దెల్లవాఱినదాఁక
జగదేకపతి మనసు జట్టిగొనెఁగాన

చ. 2: కొంగుజాఱిన మెఱుఁగు గుబ్బలొలయఁగఁ దరుణి
బంగారు మేడపైఁ బవళించెను
చెంగలువ కనుఁగొనల సింగారములు దొలఁక
నంగజగురినితోడ నలసినదికాన

చ. 3: మురిపెంపు నటనతో ముత్యాలమలఁగుపై
పరవశంబునఁ దరుణి పవళించెను
తిరువేంకటచలాధిపుని కౌఁగిటఁ గలసి
యరవిరైననుఁ జెమట నంటినదికాన

రేకు: 0054-3 సామంతం సంపుటం: 06-075

పల్లవి: మంటలంటా బెదరీని మాణిక్యాలు చూచి చెలి
యింటిలోనూ నెరవాయె నేమిసేతమే

చ. 1: నిండుఁబరితాపమున నీలపుమణులమేడ
నుండరాక దేహమెల్ల నుమ్మగించంగా
పండు వెన్నెలల మంచిబయట నిలిచిచెలి
యెండనవి తల్లడించె నేమిసేతమే

చ. 2: గ్రక్కనఁ జెలులుచేరి కప్పురపు బాగాలు
చెక్కువట్టి కదలించి చేతి కియ్యంగా
పొక్కుచుఁ జెలులఁ గన్ను బొమ్మలవిండ్లఁగోప
మెక్కువట్టి యేయ జూచి నేమిసేతమే

చ. 3: పాయక వేంకటపతి పచ్చఁబట్టు ముసుఁగులో
సోయగపు రతులను చొక్కుచునుండి
రాయడి నెవ్వతె పసపాయెనో పచ్చడమని
యేయెడ నైనా దూరే నేమిసేతమే

రేకు: 0054-4 పాడి సంపుటం: 06-076

పల్లవి: నెఱజాణ తనమూ నీ కింత కలదట
చిఱునవ్వు జెలికింత చింతైనవలదా

చ. 1: నిక్కమైన బిగువు నీకింత గలదట
చక్కనియింతికి వద్దా జడనైనాను
ఎక్కడో నీమనసు ఎంతైనఁ గలదట
చెక్కు మీఁద దరుణికిఁ జేయైన వలదా

చ. 2: నెలకొన్నకసరు నీ కింత గలదట
వెలఁదిమతికి వద్దా వెరగైనా
నిలువుఁజెలువమూ నీకింత కలదట
కలికి చెలికిఁ గొంత కాఁకైన వలదా

చ. 3: నీమేనివెరపూ నీ కింతకలదట
భామకు వద్దా తలప ట్టయినా
నేమము వేంకటేశ నీ కింతగలదట
కామినికి నింత వద్దా కౌఁగిట నీచనవూ

రేకు: 0054-5 సామంతం సంపుటం: 06-077

పల్లవి: ఎరవు గడు సత మాయె నిదియెకదవె
అరవీడుటే సొబగు లాయెఁ దురుమునకు

చ. 1: నిక్కముగ ననలమున నీరు జనియించెనను
టిక్కడనె పొడగంటి మిదియుఁగదవె
పొక్కుచును విరహాగ్నిఁ బొరలఁగాఁ జెలిమేనఁ
జిక్కఁ బైపైఁ బొడమె జవ్వాది చెమట

చ. 2: కలుగు ననలంబుకడ గాలి యనఁగా నదియు
నెలమి నిచ్చట కలిగె నిదయెకదవె
చెలఁగేటి చెలిమేనఁ జిత్త జాగ్నికిఁదోడు
నిలువ నియ్యక కలిగె నిట్టూర్పుగాలి

చ. 3: నీడల నెండలును నెయ్య మలరఁగఁ గూడు
టీడనే పొడగంటి మిదియుఁగదవె
వేడు కలరంగఁ దిరువేంకటేశ్వరుఁ గూడి
వాడుదేరఁగఁ గలిగె వనిత పరవశము

రేకు: 0054-6 భూపాళం సంపుటం: 06-078

పల్లవి: నిండిన యాసల యెండ నీడలాయె నేఁటికే
బెండువడ్డ మేనుఁదీగె బీరువోయెనేఁటికే

చ. 1: నుదురైనశశి నీచన్నుల కేల జాఱెనె
చెదరి నీముత్యాలు చెక్కుల కే లెక్కెనే
ముదిత నీతో సిగ్గు ముంగి లేల వెళ్లెనే
నిదురమానిన మోము నిగ్గులేల తోఁచెనె

చ. 2: బచ్చన నీ సింగారము బయలేఁటికాయెనే
ముచ్చట నీ మాటలకు ముసుగేల జాఱెనే
వెచ్చిన నీ మేని సొంపు వింతదోఁచె నేఁటికే
మచ్చిక నీకోరికలు మదమెక్కె నేఁటికే

చ. 3: చూపులు వెన్నెలమించుఁ జూరలాడె నేఁటికే
కోపపు నీజంకెనలగొనబాయె నేఁటికే
ఏపుమీఱి తిరువేంకటేశుఁ గూడి నీకుఁ
దాపలైనతలఁపులు దరిచేరె నేఁటికే

రేకు: 0055-1 వరాళి సంపుటం: 06-079

పల్లవి: నీకువలచిన సతికి నెగులు గలదా మీఁద
నీ కరుణ మఱవ కింతియ చాలును

చ. 1: నీ వంటి చతురునకు నిక్కంబుగా వలఁచి
జీవంబు విడిచినా సేగిగలదా
భావముల నినుఁదలచి పడఁతి యిట్లాయెనని
ఆవేళ నను దలఁచు మంతేచాలు

చ. 2: తగిలి నినుఁ బాసి సంతాపదావాగ్ని నిటు
నొగిలి నా నాకిందు నొప్పిగలదా
పగదేర మరుని పూ బాణములఁ దెగినపొం
దుగ నప్పుడైన వగతువుగా నీవు

చ. 3: కూరుముల నిటు నిన్నుఁ గూడినలతాంగికిని
వేఱె యిఁక మరుచేతి వెఱపు గలదా
సారమతి వేంకటేశ్వర నన్ను నలయించి
యీరీతి నైనఁ జన విత్తుగా నీవు

రేకు: 0055-2 భైరవి సంపుటం: 06-080

పల్లవి: భామ తొల్లిటి పూజఫలము సఫలముగాను
యేమఱక వేడుకల నిట్లఁ బూజించె

చ. 1: నొసలిలేఁ జెమటలను నునుఁగురులఁ బూజించె
కసిగాట్ల నధరంబు కలయఁ బూజించె
కొసరు కనుఁగవ కెంపు కొనలఁ బూజించె
వసివాడు మేనిపై వాసనలఁ బూజించె

చ. 2: మొలకనవ్వుల ముద్దుమో మలరఁ బూజించె
చిలుకుఁ జూపుల లోని సిగ్గుఁ బూజించె
నిలువుఁబులకలచేత నిలువెల్లఁ బూజించె
నెలఁతచనుదోయి క్రొన్నెలలఁ బూజించె

చ. 3: మనసు గోరికల కళ మర్మములఁ బూజించె
గొనకొన్న రతులచేఁ గొలికి పూజించె
ఎనసి శ్రీ తిరువేంకటేశు కౌఁగిటిలోన
వనిత సంభోగ పరవశముఁ బూజించె

రేకు: 0055-3 పాడి సంపుటం: 06-081

పల్లవి: ఘుమ్మనియెడిశ్రుతి గూడఁగను
కమ్మని నేతులు కాఁగఁగఁ జెలఁగె

చ. 1: నీలవర్ణుఁ డని నీరజాక్షుఁడని
బాలుని నతివలు పాడేరో
పాలు విదుకుచును బానల కాఁగుల
సోలి పెరుగు త్రచ్చుచుఁ జెలరేఁగి

చ. 2: మందరధరుఁ డని మాధవుఁడని గో
విందునిఁ బాడేరు వెలఁదు లిదె
నందవ్రజమున నలుగడ నావుల
మందలఁ బేయల మంచిరవముల

చ. 3: వేంకటపతి యని వేదనిలయుఁడని
పంకజనాభునిఁ బాడేరో
అంకులచేతను నలరురవంబుల
బింకపుమాటల బృందావనమున

రేకు: 0055-4 సామంతం సంపుటం: 06-082

పల్లవి: కొమ్మ నీ వెవో కోపంతు వతఁడు
రమ్మనఁగఁ బిలువ నిటు రావమ్మా

చ. 1: నెయ్య మెఱింగి చెలియ నీవె పో యతనితో
చయ్యాటములనే పగ చాటేవు
కయ్యపుమాటలకు కనుచూపు కాఁకలకు
నియ్యకొన కతనిచన వియ్యవమ్మా

చ. 2: అందముగ నతఁడు మాటాడఁగా నతనితో
మందమందమె కాని మాటాడవు
గొంది నిందాఁక చెక్కునఁ జేయి తియ్యవిదె
మందలించక వెనక మఱవవమ్మా

చ. 3: ఇప్పుడిదె తిరువేంకటేశ్వరుఁడు పచ్చడము
కప్పఁగానే కొంత కసరేవు
రెప్పలను నవ్వు పచరించి తింతటిలోన
నెప్పుడును నిటువలెనె యెనయవమ్మా

రేకు: 0055-5 భూపాళం సంపుటం: 06-083

పల్లవి: అంతదొడ్డవారమా అందుకుఁ దగుదుమా
మంతనపు మాటల మరగించేవు

చ. 1: నిన్నుఁ బోలువారమా నీయంతవారమా
వెన్నెలుఁ జల్లలు నమ్మువెలఁదులము
పన్నిన యీ రత్నాల బంగారుటిండ్లలో
యెన్నకైన తూఁగుమంచు మెక్కు మనేవు

చ. 2: చెప్పరానివారమా చెమటపై వారమా
కప్పురంపుఁ జవి యెఱుఁగనివారమా
చిప్పిలేటితేనెల సేమంతివిరుల
చప్పరములోనికి సారెఁ బిలిచేవు

చ. 3: జంకెనలవారమా సరసపు వారమా
మంకుమంకు మాటల మందవారమా
వేంకటాద్రి విభుఁడా వేడుకలరాయఁడా
తెంకికి నెప్పరిగమీఁదికి రమ్మనేవు

రేకు: 0055-6 ముఖారి సంపుటం: 06-084

పల్లవి: నినుఁ బాసినయట్లు నెలఁతకు వియోగదశ
లెన్నడునుఁ దోప విది యేమోగాని

చ. 1: నినుఁ దలచి లలితాంగి నీరూప మాత్మలోఁ
గని నీవు నవి బయలు కౌఁగిలించినది
తనర నాకాశతత్త్వము నీమహత్త్వమని
వనిత యెవ్వరిచేత వినెనోకాని

చ. 2: నినుఁ బొగడి నీరూపు కనుదోయి కెదురైన
తనివి దీఱక బయలు తగఁ జూడఁదొడఁగి
మునుకొన్న సర్వతోముఖుఁడ వనఁగా నిన్ను
వెనుక కే భావమున వినెనో కాని

చ. 3: తలఁపునను వాకుననుఁ దలఁపఁ దలఁపఁగ నీవు
కలసి యీ కమలాక్షిఁ గౌగిలించితివి
తెలసితిమి వేంకటాధిపతి నీ విన్నింటఁ
గలవనెడిమాట నిక్కంబువోకాని

రేకు: 0056-1 రామక్రియ సంపుటం: 06-085

పల్లవి: నతు మమ తాసన్మానస్త్వదీయ
నితాంతహితసరణిం నమామి

చ. 1: న వదతు భవాన్ జనార్దన ఘనరతి
వివాదవచనం వృథా వృథా
తవ మృదువేదసుధామయవచనై
ర్వివిధావశపదవీం వహామి

చ. 2: న భజతు మాం కరుణానిధే భవ
ద్విభవవినయశ్చ వృథా వృథా
త్రిభువన సుఖకర దివ్యరూప తే
ప్రభుతయాపరాభవం భజామి

చ. 3: న చలతు వేంకటానాథ మాం వినా
విచరణమపి తే వృథా వృథా
సుచరిత్రస్త్వం సుభగస్త్వం త్వాం
కుచయో: పులకాంకురై ధ రామి

రేకు: 0056-2 కన్నడగౌళ సంపుటం: 06-086

పల్లవి: ఒప్పుమి మేలై యొనఁగూడె నాకు
నె(త?)ప్పులే ఒప్పవుట చెప్పనేలమ్మా

చ. 1: నవ్వులచూపులు నాఁటినచోటు
నొవ్వులు సేయక నొచ్చినే
దవ్వులమాటలు తాఁకినతావూ
రవ్వలచేఁతల రాఁగినే

చ. 2: తియ్యపుఁ జేఁతలఁ ద్రవ్వినచోటు
వయ్యమై హృదయము నాడీనె
కయ్యపుఁ గాఁకలఁ గ్రాఁగినతావూ
ఒయ్యన పై పై నుడికీనే

చ. 3: కొండలరాయనిఁ గూడిన మనసూ
కొండయి లోలోనె కూడీనే
నిండిన తమకము నించిన యతఁడూ
మెండైన నాప్రేమ మెచ్చీనే

రేకు: 0056-3 ఆహిరి సంపుటం: 06-087

పల్లవి: ఇన్నియును దగఁగలిగె నీయింతి కిదె యిపుడు
కన్నియల కిందరికిఁ గలిగె మోహములూ

చ. 1: నిగనిగని మెఱుఁగు వెన్నెల మోమునకుఁ గలిగె
చిగురుమోవికిఁ గలిగెఁ జిఱునగవులు
పగటుఁగనుఁగొనలఁ బలపలని కెంపులు గలిగె
పొగరుఁజెమటలు గలిగె పొలఁతిచెక్కులను

చ. 2: ఒయ్యార మగు నలపు లువిదమేనికిఁ గలిగె
గయ్యాళి నడపులకుఁ గలిగె మురిపెములు
తొయ్యలికిఁ గలిగె సంతోషంపుఁ బరవశము
పయ్యెదకుఁ గలిగెఁ బయిపైని నునుఁబూఁత

చ. 3: వెలఁది కిప్పుడు గలిగె వేంకటేశ్వరు కరుణ
తలఁపులకుఁ గలిగె చింతా వియోగంబు
పులకలకుఁ గలిగెఁ దలఁపులలోని జొంపములు
అలుకలకుఁ గలిగెఁ బాయని విలాసములు

రేకు: 0056-4 సామంతం సంపుటం: 06-088

పల్లవి: పలుకులఁదేనియ లొలికెడిచక్కని
వెలఁదులు కోనేటి విభునిఁ బాడెదరె

చ. 1: నలికపుఁజూపుల నగవుల నునుసిగ్గు
దొలఁకంగ నిగ్గు దోఁపంగ
కలికికి కన్నుఁగవ కాంతలు ప్రేమ
నెలయించి తిరువేంకటేశునిఁ బాడెదరె

చ. 2: పెదవుల సన్నపు బీటల మెఱుఁగులు
పొదలంగ ముద్దులు పొలయంగా
వదనము సొబగులు వనితలు కడుఁ
గదసి వెంకటగిరి ఘనునిఁ బాడెదరె

చ. 3: భారపుఁ గుచముల కన్నీటి చెమటలు
జారంగా తావిచల్లంగా
కూరిమి రచనలు గొసరుచుఁ గడు
ధీరునిఁ గోనేటి తిమ్మనిఁ బాడెదరె

రేకు: 0056-5 సామంతం సంపుటం: 06-089

పల్లవి: ఎట్టు దొరికెనె చెలియ యిద్దరికి నిటువంటిఁ
పట్టనిలుపఁగరాని బరువైన వలపు

చ. 1: నిడివి తమకములచే నిట్టూర్పు లివె నీకు
అడియాస తమకంబు లాతనికిని
కడలేని వేదనల కన్నీళ్లివే నీకు
అడరుఁబరితాపంబు లాతనికిని

చ. 2: గుఱుతైన యతనిపై గోరాటలదె నీకు
అరుదైన ప్రియమాన మాతనికిని
పురిగొన్న విరహమునఁ బొరలాట లవె నీకు
అరమరపుఁ బరవశము లాతనికిని

చ. 3: ఎనసి యాతనిరాక కెదురుచూచుట నీకు
అనుకూలుఁడై కలయు టాతనికిని
అనయంబు తిరువేంకటాధీశుఁ డిడె నీకు
అనుభవన కెల్ల నీ వాతనికిని

రేకు: 0056-6 భైరవి సంపుటం: 06-090

పల్లవి: పట్టి కింత మాచెఱఁగు బాఁపఁడా నాఁడె
పుట్టిఁ గట్టితివి కుల మోబాఁపఁడా

చ. 1: పలుకుల వాదాలబాఁపఁడా యిట్టె
పలునీళ్ల మునిఁగె బాపఁడా
పలువంచలఁ బొరలే బాఁపఁడా యిట్టె
వొలికిజంటెలఁ గోప మోబాఁపఁడా

చ. 2: పాయనియాసొదపు బాఁపఁడా ఇట్టె
బాయిటఁ బడె నీ విద్య బాఁపఁడా
పాయపు తల జడల బాఁపఁడా యిట్టె
వోయయ్య బతిమాలకు మోబాఁపఁడా

చ. 3: పారవేసేపు సిగ్గెల్ల బాఁపఁడా యిట్టె
పాఱితెంచేటి కమ్మటి బాఁపఁడా
భారపు వేంకటగిరి బాఁపఁడా మమ్ము
నోరసేయక కూడితి వోబాఁపఁడా

రేకు: 0057-1 నాట సంపుటం: 06-091

పల్లవి: ఇంకా నేఁటికి నింతులు
వేకంటరాయఁడ విడు విడు చెఱఁగూ

చ. 1: పిరిగొన్న ముత్యపుఁ బేరులనడుమను
తెరవను దాఁచుక తిరుగుచును
కెరలుచు నాకౌఁగిటికి దగ్గటేవు
వెఱపు లేక నీవు విడువిడు చెఱఁగు

చ. 2: ప్రేమ మలర నతి బింకపునీనగు
మోమున నలముక మురియుచును
తామసమతితో తమ్ముల మిడుకొని
వేమరుఁ గోరక విడు విడు చెఱఁగు

చ. 3: చుట్టుఁద పొరపు చుంగుల నడుమను
పెట్టితి వింపున ప్రియసతిని
రట్టడి వేంకట రమణుఁడ కలసితి
వెట్టిగాద యింక నిడు విడు చెఱఁగూ

రేకు: 0057-2 శ్రీరాగం సంపుటం: 06-092

పల్లవి: కటకటా విరహు లెక్కడ బ్రదుకఁగలవారు
కుటిలంపుఁ గీరముల గూఁటఁ బడ వాయె

చ. 1: పంచబాణునకు నాపద లెందు లేవాయె
మంచుఁగిరణము లతనిమీద మణఁగదాయె
పెంచుకోవిలనోరు పెడతటికిఁ బోదాయె
చంచరీకములకునుఁ జావు లేదాయె

చ. 2: చిగురాకుఁ గులమునకుఁ జే టెందు లేదాయె
పగటు నునుగాలిఁ బెనుఁబాము దినదాయె
సొగఁసుగమ్మని విరులచొప్పణఁగి పోదాయె
బిగువు నామనిమీఁదఁ బిడుగువడదాయె

చ. 3: తిరువేంకటాచలాధిపుని కరుణారసము
తరుణులకు నందఱికి దైవాఱదాయె
పరివోని సురత సంపదలఁ దెప్పలఁదేలి
వరవధూతతికిఁ బరవశము లేదాయె

రేకు: 0057-3 శంకరాభరణం సంపుటం: 06-093

పల్లవి: కుటిలా లేఁటికి కోమలియెడ నేఁ
డిటువలెఁ జేయఁగ నిం పౌనా

చ. 1: పుప్పొడిచల్లినఁ బొక్కెటిదేహము
కప్పుర మేఁటికిఁ గలుపేరె
ఒప్పుగ వేనీ ళ్లొల్లనిదేహము
నిప్పులు చల్లఁగ నిలచీనా

చ. 2: వెన్నెలబాయట వేగెటిమేనికి
పన్నీ రేఁటికిఁ బామేరె
సున్నపురాతికి జొబ్బిల నుదకము
నున్నతిఁ జల్లఁగ నోర్చీనా

చ. 3: తిరువేంకటపతి తెప్పలఁ దేలఁగ
తరుణికి నేఁటికిఁ దాపములూ
దొరకొని దైవముతో మాటలాడఁగ
పరికెలు వెట్టఁగఁ బాడౌనా

రేకు: 0057-4 కాంబోది సంపుటం: 06-094

పల్లవి: ఇన్నియుఁ గొత్తలు దోఁచె నింతలోనె చెలి నీకు
విన్నని నగవు లెస్సవిధ మేఁటి కాయెనే

చ. 1: పెట్టిన కస్తూరి బొట్టు పెదవిపై కేలా జాఱె
కట్టిన చెంగావి కెంపు కన్నుల కే లెక్కెనె
పుట్టిన లేఁజమటలు పులక లేఁటికిఁ గప్పె
పట్టిన తామరమొగ్గ పదనేఁటి కాయెనే

చ. 2: కప్పినపయ్యదకొంగు కడకు నేఁటికి జాఱె
తిప్పిన మొగములోన తెలివేటిఁకుండెనే
చెప్పినమాటలలోన చిఱునవ్వు లేల తోఁచె
ఒప్పైన చెలువ నీకు నొరుపేఁటి కాయెనే

చ. 3: నిండిన సైరణలకు నిజ మేల లేదాయె
పండిన కోరికలకు ప్రాణ మేల వచ్చెనే
కొండలలో నెలకొన్న కోనేటిరాయఁడు గూడె
యెండ లేని నీడ నీకు నితవేల ఆయెనే

రేకు: 0057-5 సామంతం సంపుటం: 06-095

పల్లవి: చక్కఁదనములు గొంత జాణతనములు గొంత నీ
వెక్కసము లెల్లఁ జాలు వేసాలఁ బోకురా

చ. 1: పూసిన తట్టు పుణుఁగు బూమిలోనా లేనివింత
వాసనై లోకము వారి వలపించఁగా
ఆసలనే మమ్ముఁ గడు నలయించే వోరి నీవు
చేసినట్టి చేతు గాని చెఱఁగు విడువరా

చ. 2: మెత్తినట్టి మృగనాభి మేన నెల్ల నిండె నిత్య
కొత్తలై నీ సొబగెల్లఁ గుప్పళించంగా
బిత్తరి చూపులతోడ ప్రియమైన కడకేఁగి
వత్తుగాని అంతకు నీవన్నె చూడనియ్యరా

చ. 3: కట్టినట్టి పచ్చఁబట్టు కమ్మని పువ్వులతావి
యిట్టు నట్టు నెల్లవారి నెలయించఁగా
దిట్టనాయకుఁడ వోరి తిరువేంకటేశ నీ
పట్టినచలమే దక్కె బాపు వూరకుండరా

రేకు: 0057-6 ముఖారి సంపుటం: 06-096

పల్లవి: అడవిచాటున నుండి యాఁటదానను న
న్నుడి కించే వేరా నీ వుడుకునను

చ. 1: పించెపుఁ బయ్యెదలోని పెనుగుబ్బలు మూయుచు
చెంచెత యేల యేఁచేవె చెల్లఁబో నన్ను
మంచుఁబులకలచాటు మగనాలిగుబ్బలు సో
ధించి చూచే వేరా తెట్టఁదెరువునను

చ. 2: తొలుకరి మెఱుఁగుల తొడలయాకుఁజీరచె
నలయించే వేఁటికి నీ వయ్యో నన్ను
నులివెచ్చమాటల నొవ్వ నామనము సోఁకఁ
బలికే వదేర బట్టబాయిటను

చ. 3: చిక్కనితేనెలతావి చిగురుమోవి నవ్వుచు
చక్కఁజూడ కేల పగచాటేవె నన్ను
చక్కని వేంకటగిరిస్వామి నాకౌఁగిలి నీకు
పుక్కట దొరకె పొట్టఁబొరుగుననూ

రేకు: 0058-1 ఆహిరి సంపుటం: 06-097

పల్లవి: అపు డేమనె నేమను మనెను
తపమే విరహపుఁ దాపమనె

చ. 1: పవనజ యేమనె పడఁతి మఱేమనె
అవనిజ నిను నేమను మనెను
రవికులేంద్ర భారము ప్రాణంబనై
ఇవల నెట్ల దరియించే ననె

చ. 2: యింకా నేమనె యింతి మఱేమనె
కొంకక యేమని కొసరుమనె
బొంకులదేహము పోదిది వేగనె
చింకవేఁట యిటు చేసె ననె

చ. 3: నను నేమనె ప్రాణము మన కొకటనె
తనకు నీవలెనె తాపమనె
మనుకులేశ ప్రేమపుమనకూటమి
ఘనవేంకటగిరిఁ గంటి ననె

రేకు: 0058-2 ఆహిరి సంపుటం: 06-098

పల్లవి: అంతకంతకును వెఱపయ్యీని
యెంత నను వలపించి యేఁచేవో యనుచు

చ. 1: పయ్యె దెడలించి గుబ్బల నిన్ను నలమఁ బ్రియ
మయ్యీని మిగుల వెఱ పయ్యీని
గయ్యాళి రతుల ననుఁ గరఁగించి మరుబారి
నుయ్యాల పాలయలుక నూఁచేవో యనుచు

చ. 2: వెడవెడని తమ్ములము వీడుదోఁడాడ మన
సడరీని తలఁప వెఱపయ్యీని
వడిలోక మేలు దేవర దివ్యవదనంబు
కడుల నెంగిలని యొరులుగందురో యనుచు

చ. 3: గొప్ప సవరంబు నాకొప్పులో ముడిచేవు
అప్పటి నాకు వెఱపయ్యీని
చెప్పఁగడు నరు దైన శ్రీవేంకటేశ యిది
యిప్పు డెవ్వతెకు నీ విత్తువోయనుచు

రేకు: 0058-3 పాడి సంపుటం: 06-099

పల్లవి: తోడెనే వుండెరువ మందు నేరిచెనె
విడని తలంపు లివి వేఁగీనె తామును

చ. 1: పతిఁ బాసి మేను తాపమైన నాయెఁగాక
యితవైన యూరుపుల కేమి మూడెనె
సతతము నా హృదయజలజములోఁ బాయని
యతని నంటియుఁ దాప మందెనె తామును

చ. 2: కినిసి కోరికలు వేఁగినను వేఁగెఁగాక
తనివోని కన్ను లేల తమకించీనె
యెనలేని చూపులనె యెదుటఁ బ్రాణ విభునిఁ
గనుఁగొనుచు వగలఁ గందీనే తామును

చ. 3: అరిది ముదములకు నక్కరయిన నాయెఁగాక
పరవశముల కేమి బాధ వచ్చేనె
దిరు వేంకటగిరి దేవుని కౌఁగిటఁ గూడి
బిరుసుగ మేను మఱిపించీనె తామును

రేకు: 0058-4 ఆహిరి సంపుటం: 06-100

పల్లవి: ఆకాశపాకాశ మాయెఁ గోమలినడుము
వైకుంఠపతిపొందు వడిఁ దెలుపుకొఱకు

చ. 1: పరగఁ గెమ్మోవిపై పగలు చుక్కలు వొడిచె
పరివేషమృగనాభిఁ బరగె మోము
మరునిసమరమునఁ గోమలి విభునితోఁ జెనకు
సరసతల కిదియ సూచన చంద మాయె

చ. 2: ఎలమి బొమ్మలజంకె లింద్రధనువులు వొడిచె
మొలచెఁ గన్నులఁగావి మొయిలు ఘనమై
కొలఁది కగ్గలపుఁగుంకుమచెమట నెత్తురులు
పొలఁతిపైఁ గురియుటకుఁ బోటివలె నాయె

చ. 3: అంగనకునెడమతొడ అదరి భూకంపంబు
సంగతి వహించెఁ జంచలము లేక
ఇంగితంబుగ వేంకటేశుఁ గూడినపొందు
కొంగుబంగారమై కోరికలు మీఱె

రేకు: 0058-5 సామంతం సంపుటం: 06-101

పల్లవి: ఎటువంటి మోహమో యెట్టితమకమొ కాని
తటుకనను దేహ మంతయు మఱచెఁ జెలియ

చ. 1: పలుకుఁదేనెలఁ గొసరి పసిఁడి కిన్నెర మీఁటి
పలుచ నెలుఁగున నిన్నుఁ బాడి పాడి
కలికి కన్నీరు బంగారు పయ్యద నొలుక
తలయూఁచి తనలోనె తలవంచుఁ జెలియ

చ. 2: పడఁతి నీవునుఁ దాను పపళించు పరపువై
పొడము పరితాపమునఁ బొరలి పొరలి
జడిగొన్న జవ్వాది జారు చెమటలఁ దోఁగి
యుడుకు నూరుపుల నుసురుసురాయెఁ జెలియ

చ. 3: తావి చల్లెడి మోము దమ్మి గడు వికసించె
లోవెలితి నవ్వులను లోఁగి లోఁగి
శ్రీవేంకటేశ లక్ష్మీకాంత నినుఁ గలసి
యీ వైభవము లందె నిదివో చెలియ

రేకు: 0058-6 కాంబోది సంపుటం: 06-102

పల్లవి: ఉప్పవడము గావయ్యా ఉయ్యాలమంచముమీఁద
గొప్పగొప్ప కన్నుల గోవిందరాజా

చ. 1: పవ్వళించే వీడ వచ్చి పాయనినీయలపెల్ల
మువ్వంక మే నితోడ ముచ్చట దీఱ
నవ్వేటి శ్రీ సతి చూపు నాటిన చిత్తపుమేన
క్రువ్వనికలువదండై గోవిందరాజా

చ. 2: నిద్దరించే వీడ వచ్చి నిలుచున్నయలపెల్ల
ప్రొద్దువొద్దునకుఁ దీర భోగీంద్రుపై
యిద్దరు సతులు నీకు నేచిన తాళగతుల
గుద్దేటి పాదములతో గోవిందరాజా

చ. 3: మెండుగ మేలుకొంటివి మించిన కౌఁగిటిలోన
కొండుకపాయపుసిరి కోపించంగా
ఉండవయ్యా సుఖలీల నుడివోనిప్రియముతో
కొండలకోనేటిరాయ గోవిందరాజా

రేకు: 0059-1 సామంతం సంపుటం: 06-103

పల్లవి: భ్రమయించే విట్టే పదిమారులు
నిమిష మేఁడాయె నీ చేత నాకు

చ. 1: పాఁతమడుగుగడ్డఁ బడి యీఁతకాఁడవు
లోఁతు చొరకురా లోఁగేవు
మూఁతులే గిరువంగ మోము నొచ్చీనంత
బాఁతి మీఱఁ బకపక నవ్వకురా

చ. 2: అలవిగాని మోహపు టాసకాఁడ నీ
వలుగకురా వెఱపయ్యీని
అలరి నీటఁ గొండలైనఁ దేలించేవు
లలనపైనె నీలా వింత వలెనా

చ. 3: రచ్చరావికింద రంతులె చేసేవు
బచ్చనమాటల వసకాఁడ
రచ్చ చేసే వింక రాతి గుండె తోడ
వెచ్చపు సొలపుల వేంకట విభుఁడా

రేకు: 0059-2 రామక్రియ సంపుటం: 06-104

పల్లవి: విచ్చేయవమ్మా వెన్నెలబొమ్మా
మచ్చిక మరుని ఢాక మగువ నీ రాక

చ. 1: పంచల పసిండి నిగ్గు వచ్చిదేరే సిగ్గు
వంచన వలపు తీపు వాలుక చూపు
కంచపుంబాలకూడు కాఁకలనీవాడు
మంచపు నీ తలఁబ్రాలు మట్టెల పాదాలు

చ. 2: కోవిల కొసరుఁబాట కొమ్మరో నీ మాట
తావులచెంగావి నీ తళుకు మోవి
గోవ జవ్వాదికరంగు గుబ్బల నీ మెఱుంగు
భావజు దాడి రొదలు పాదపు నీ కదలు

చ. 3: ముద్దుల నీ నగవు చిమ్ముల రతి బిగువు
అద్దలింపుఁ గసరు మోహంపుఁ గొసరు
గద్దరి నీ యలపు వెంకటపతి తలఁపు
అద్దపునీమోము మోహనరతిసాము

రేకు: 0059-3 సామంతం సంపుటం: 06-105

పల్లవి: మాట లాడనేరని రమణిఁబో నేను, నా
మాటలెల్లఁ బైఁడి వంటి మాటలే గదె

చ. 1: పచ్చగందని పడుచఁ బడఁతి నేను, నేఁ
డచ్చి వేసినట్టి వనితనె కదవె
లచ్చిగొండి నీవంటినెలఁతనా నేను, యింత
పెచ్చువెరిగే వదేమె పిన్నదానవా

చ. 2: మిగులదళము గలమేఁటిఁబో నేను, నీ
దగునింటి ముంగిటి నిధానమంగదే
జగడాలగంప దింపుసతినా నేను, యింత
చిగురుఁగొమ్మ వదేమె చిన్నదానవా

చ. 3: తలపూ వాడని తరుణినే నేను, నే
నలరుఁజవికలోనియాకెనే కదే
కలికి వేంకటపతి కాంతనేనూ నేఁ
దొలియింతి నాకంటె దొడ్డదానవా

రేకు: 0059-4 సామంతం సంపుటం: 06-106

పల్లవి: పొద్దు వోయె నింక నేల బూమెలు, యింత
వద్దు నీకు సింగారాలు వచ్చేవొ రావొ

చ. 1: పల్లవపు బరపుపై పవ్వళించు చెలిలాగు
తల్లడ మయ్యోడి నేము దలఁచినా
చొల్లెపుఁజుట్లే నీకుఁ జుట్టబట్టె నింతవడి
వల్లడి వలపు కాఁడ వచ్చేవొ రావొ

చ. 2: పొడలు వెట్టుచునున్న పొలఁతిభావము చెప్ప
తడఁబడె నాలిక తమకాన
కడు ముత్యపుఁ బేరులె కట్టఁబట్టె మెడనిండ
వడచల్లు చూపుకాఁడ వచ్చేవొ రావొ

చ. 3: యింతి మేనిపరితాప మింతేసి నే మెఱింగింప
పంతానికె విచ్చేసితి పైకొని
కంతునిగురుఁడ వేంకటరాయ యిటమీఁద
వంతఁబెట్టక యిట్టె వచ్చేవొరావొ

రేకు: 0059-5 శంకరాభరణం సంపుటం: 06-107

పల్లవి: సిగ్గున నీవలె నేఁ జెప్పుకొనఁ గాకా
దగ్గఱి నాదేహ మంటి దానసైన నమ్మేవా

చ. 1: పాయ లేక నన్నుఁ బాసి పట్లువెట్టు కొంటినంటా
మాయలుసేసే వదేర మాఁటిమాఁటికి
యీయెడ నేఁ బుట్టుతో నీయెదుటనె నిలుచున్న
చాయలమాట లనక చాల నీవు నమ్మేవా

చ. 2: పట్టలేక నన్నుఁ బాసి ప్రాణ మింతా బరవంటా
వొట్టుక నామీఁద నీవు వొలవేసేవు
గుట్టున నేవూరుపులు గుమ్మరించ నెఱుంగక
పట్టిన నాప్రాణ మిదె పైపై నున్నదిరా

చ. 3: ఇప్పుడు ననుఁ బాసి యిదె మేను చొక్కెనంటా
వొప్పుగ నామీఁదఁదెచ్చి వొళ్లువేసేవు
కప్పరా పచ్చడము వేంకటగిరీంద్రుఁడ నాకు
నప్పుడె నీకంటెను లోనైతి నిదె చాలదా

రేకు: 0059-6 మలహరి సంపుటం: 06-108

పల్లవి: మొల్లలేలె నాకు తన్నె ముడుచు కొమ్మనవె నేఁ
జెల్ల పూవు కొప్పుతావి చెంచుదానను

చ. 1: పట్టుచీరేఁటికి నాకు పారిటాకులె చాలు
దట్టిగట్టుకొమ్మనవే తనమొలనే
పట్టెమంచ మేలె నాకు పవ్వళించు మనవె నేఁ
జెట్టుకిందఁ బొరలాడే చెంచుదానను

చ. 2: సందిదండ లేలె నాకు సంకుఁగడియమె చాలు
యిందవే యెవ్వతెకైన నిమ్మనవె
గందమేలె నాకు చక్కని తనకే కాక నేఁ
జిందువందు చెమట మై చెంచుదానను

చ. 3: కుచ్చుముత్యా లేలె నాకు గురివిందలె చాలు
కుచ్చి తనమెడఁ గట్టి కొమ్మనవె
కచ్చుపెట్టి కూడె వేంకటగిరీంద్రుఁడు నను
చిచ్చినే నడవిలో చెంచుదాననూ

రేకు: 0060-1 పాడి సంపుటం: 06-109

పల్లవి: పిల్లఁ గ్రోవి పట్టుమంటాఁ బెరరేఁచీని మా
గొల్లవారి పిల్లఁగోవి కోరో చల్లా

చ. 1: పాడుమంటా దండెమీఁటెఁ బలుమారునుం దా
వేడుక నెవ్వతెపాట వినవచ్చెనో
వాడలోఁ జల్లలమ్మే వనిత నింతే శ్రుతి
గూడి నేఁ బాడేటిచల్ల కోరో చల్లా

చ. 2: చేరి నన్ను నాడుమంటాఁ జెక్కు నొక్కీని తా
గారవాన నెవ్వతాట గనివచ్చెనో
మారుకు మారాడేటి మందవారము మేము
కోరికి నాడేటి చల్ల కోరో చల్లా

చ. 3: కిన్నెర మీటుమంటాఁ గెలసీని తన్నుఁ
గిన్నెర మీట్ల నేది గిలిగించెనో
కన్నుల కలికి వేంకటపతిపై వెట్టి
గొన్న కిన్నెరగుబ్బల కోరో చల్లా

రేకు: 0060-2 సామంతం సంపుటం: 06-110

పల్లవి: వింత వింత వింతలూ, నీ
చింతలే పో చిగిరింతలూ,

చ. 1: పోపో పోపో విడవోయీ నీ
చూపు మాపై జూఁడించకా,
రేపే పో రేసులెల్లా నీ
తీపేపో తీదీపులూ,

చ. 2: చాలుఁ జాలుఁ జాలుఁ బోవోయీ, నీ
జాలి మాపై జల్లించకా
రేలేపో రిచ్చలెల్లా నీ
మేలే మేలే పో మెరమెరలూ

చ. 3: రాఁపు రాఁపు రాఁపు లేలోయీ నీవు
మాపుదాఁకా మాతోడనే
యేఁపకు వేంకటేశ నన్ను నీ
కాపురమే పో కరఁగింతలూ

రేకు: 0060-3 నాదనామక్రియ సంపుటం: 06-111

పల్లవి: చెల్లెఁగా నీవు సేసినచేఁతలు నీవు
వొల్లకే విభునింతవొడలు వేఁచితివి

చ. 1: పొడపుఁ జందురుఁడు నొప్పులు సేయువిరహులను
పెడమొకముచేసి నొప్పించేవు
కడుఁ బలికి కీరములు కారించు విరహులను
పడతి పగఁబెట్టితివి పలుకకే విభుని

చ. 2: తొలుమెఱుపు మెఱిచి పాంథుల నొంచు నీ వెదుట
పొలయకే నొంచితివి పొలిఁతి యతని
బలుపువెన్నెల భంగపఱచు విరహుల నింత
నలఁగించితివి నీవు నవ్వకే విభుని

చ. 3: పన్నీరు విరహులను బరవశముసేయు నీ
మన్ననఁ గౌఁగిటఁ జేర్చి మరపించితి
కన్నియరో నీవు వేంకటవిభుని కౌఁగిటను
ఇన్నిటను గడుమించి తేమి చెప్పెడిదే

రేకు: 0060-4 శంకరాభరణం సంపుటం: 06-112

పల్లవి: ఓయమ్మ వెరపించె నొకభూతమూ
రోయక యిన్నిటనుం దిరుగు భూతమూ

చ. 1: పది శిరసుల పెద్ద బమ్మ రాకాసునిని
జెదరనీక యడిచిన భూతమూ
మదమున బాలెంత మగువ నెత్తురు పిన్న
పెదవిఁ బీలిచెఁ బెను భూతమూ

చ. 2: వేయి చేతుల పెద్ద వెడగు దానవునిఁ
జేయి చాఁచి యడిచిన భూతమూ
రాయడింపుచు బెద్దదంటరక్కసుని
బాయం జీరిన బలు భూతమూ

చ. 3: పడుచుఁ బట్టుక వేఁచే పసిఁడిదైత్యునిని
కడుపు చించిన ఘన భూతమూ
అడరి శ్రీ తిరువేంకటాద్రి మీఁద నుండి
పొడచూపె నదివో పెంపుడు భూతమూ

రేకు: 0060-5 శ్రీరాగం సంపుటం: 06-113

పల్లవి: జాణతనా లాడే వేలే జంపు గొల్లెతా వోరి
ఆణిముత్యముల చల్ల లవి నీకుఁ గొల్లలా

చ. 1: పోయవే కొసరుఁజల్ల బొంకుగొల్లెతా, వోరి
మాయింటి చల్లేల నీకు మనసయ్యీరా
మూయకువే చల్ల చాడిముచ్చు గొల్లెతా వోరి
పోయవొ పోవొ మాచల్ల పులు సేల నీకును

చ. 2: చిలుకవే గోరం జల్ల జిడ్డుగొల్లెతా వోరి
పలచని చల్ల నీకు బాఁతిగాదురా
కలఁచవే లోనిచల్ల గబ్బిగొల్లెతా వోరి
తొలరా మా చల్లేల దొరవైతి నీకు

చ. 3: అమ్మకువే చల్లలు వొయ్యారిగొల్లెతా వోరి
క్రమ్మర మాతోడ నిట్టే గయ్యాళించేవు
సొమ్మెలం బోయే వేలే సొంపుగొల్లెతా వోరి
దిమ్మరి కోనేటిరాయ తిరమైతి నికును

రేకు: 0060-6 సామంతం సంపుటం: 06-114

పల్లవి: అందుకే వెఱచేనో యమ్మలాలా తన
కందువకే పారంబోయి కాలుజారె బిడ్డండు

చ. 1: పాలకడవలును బానలవెన్నలును
ఓలిం బెట్టి వుట్లపై నుండంగాను
నేలనుండి యెగసి నిక్కితీసె నిదివో
పాలు గాసు సేయ విడి పడఁబోయె బిడ్డఁడు

చ. 2: కమ్మని నేతులును గడ్డల జున్నులును
కమ్మి వెద్దకాఁగులతో కాఁగంగాను
దిమ్మరియై తొడికి తియ్యం బోయీ నిదివో
అమ్మరో వ్రేళ్లు పొక్కి అగ్గిదాఁకి బిడ్డఁడు

చ. 3: కోడెలఁ బేయలను కూడఁగట్టి విడిచి
వోడక వీథులం బరువులు దోలీని
వేడుక కాఁ డిదెవో వేంకటేశ్వరుఁడు
ఆడకు నీడకుఁ బాఱి అలసీని బిడ్డఁడు

రేకు: 0061-1 మలహరి సంపుటం: 06-115

పల్లవి: ఆయలేరే యేమి చెప్పి రాతనిసుద్దులు నాకూ
తాయిమక్కళాలె కాక దయగద్దా తనకు

చ. 1: కన్నులఁ జూడనె పట్టె కాఁకలు సేయనె పట్టె
ఇన్నిటా తా నన్నుఁ గూడే దెప్పుడో కాని
సన్నలు సేయనే పట్టె చవులు చూపనే పట్టె
వెన్నెలబాయిటికి రా వేళ లేదు తనకు

చ. 2: నవ్వులు నవ్వనే పట్టె నాలిసేయనే పట్టె
ఇవ్వల నన్నుం గూడేది యెన్నఁడే తాను
పువ్వుల వేయనే పట్టె బుజ్జగించనే పట్టె
పవ్వళించం బ్రొద్దులేదు పను లేలే తనకు

చ. 3: మాటలాడనే పట్టె మనసు చూడనే పట్టె
ఈటునం గాలు దొక్కేది యెన్నఁడే తాను
పాటించి శ్రీ వెంకటాదిపతి నన్ను నురముపై
తేటలుగా నెక్కించుక దించ నెడలేదు

రేకు: 0061-2 ముఖారి సంపుటం: 06-116

పల్లవి: పట్టి రైరిగా మిమ్ముఁ బడఁతులు వద్దనుండి
ఒట్టిచే ముట్టి సరసా లొద్దంటిఁగా

చ. 1: పువ్వులచెండున వేసి పప్పొడి వాటులం బడి
నొవ్విఁ బడే వేలే కన్నులఁ దిట్టు తా
అవ్వలివ్వలివెములై అలిగితి రిద్దఱు
నవ్విన నవ్వి జగడాలు నడుమనే వచ్చెఁగా

చ. 2: చిలుకవే గోరం జల్ల జిడ్డుగొల్లెతా వోరి
పలచని చల్ల నీకు బాఁతిగాదురా
కలఁచవే లోనిచల్ల గబ్బిగొల్లెతా వోరి
తొలరా మా చల్లేల దొరవైతి నీకు

చ. 3: అమ్మకునే చల్లలు వొయ్యారిగొల్లెతా వోరి
క్రమ్మర మాతోడ నిట్టే గయ్యాళించేవు
సొమ్మెలం బోయే వేలే సొంపుగొల్లెతా వోరి
దిమ్మరి కోనేటిరాయ తిరమైతి నీకును

రేకు:	0032-1 రామక్రియ	సంపుటం:	06-117

పల్లవి:	తానే చూడవే యీతండు నన్ను
	పోనీ పోనీ పోనీ ననీనే

చ. 1:	చల్ల లమ్మనీఁడే సారెకు నాపైఁ
	జల్లీఁ జల్లీ చక్కందనమే
	నల్లని జాణుండు వీఁడే నే
	నొల్ల నొల్ల నొల్ల నోయమ్మా!

చ. 2:	పువ్వుల నిప్పుడు వేసేని నాతో
	నవ్వి నవ్వి నక్కుం జూపుల
	దవ్వుల నీతండు చూడవే నే
	నవ్వా నవ్వా నవ్వా నోయమ్మా!

చ. 3:	ఇంకా నలమీ నీతండు నాతోఁ
	గొంకీ కొంకి కోరికల
	వేంకటేశుం డరవిరియ్యె నేఁ
	బొంకా బొంకా బొంకా నోయమ్మా!

రేకు: 0032-2 ఆహిరి సంపుటం: 06-118

పల్లవి: చక్కని బోయ జవరాలు మించు
చెక్కుపై చేతితో చెలి దూరే నిపుడు

చ. 1: చింతచిగురుదెచ్చి చెలువైన వలపుల
సంతనమ్మిన బోయ జవరాలు
కంతుగురుఁడ నిన్నుఁగలయంగఁ దలపోసి
చింతచిగురుచేతఁ జిమిడే నిపుడు

చ. 2: కిన్నర కులుకుల కెరలి జారెడి గుబ్బ
చన్ను మూయదు బోయ జవరాలు
వెన్నుఁడ నినుఁ బాసి వెడమాయ కోవిల
కున్నల కులుకులు గులికే నిపుడు

చ. 3: వల్లెవాట్లతోడ వడిఁ బెద్దకన్నుల
చల్లుఁ జూపులబోయజవరాలు
నల్లని తిరుమల నాయని కౌఁగిట
చల్లని చూపుల జంకించె నిపుడు

రేకు: 0032-3 ముఖారి సంపుటం: 06-119

పల్లవి: ఏమి సేయఁ గలమయ్య యేలికయ్య
సోముని కళల మోము చూడకుంటేఁ జూడవు

చ. 1: చెలి చక్కనిది గాదో చిత్త మేమి రాదో
కొలఁది మీఱిన నీపై కూరిమి లేదో
ఎల జవ్వనము కొల్ల లీదో వాదొ
ఒలసీనొల్లముల నీ వొల్లకుంటే నొల్లవు

చ. 2: మరుఁ డేమి మతిలేఁడొ మఱచి వున్నాఁడొ
గరిమల విలుకాఁడు గాఁడో లేఁడో
దొరకుం జెఱకు విల్లు తూఁడో యేఁడో
సిరుల నీచిత్త మిది చేరకుంటేఁ జేరదు

చ. 3: మ్రొక్కనిదే చలమో మోహ మేమి ఖిలమో
పక్కం బాసినందు కేమిఫలమో
యెక్కువ వేంకటరాయ యేతులేని పాలమో
మిక్కిలైతి విందాఁక మెచ్చకుంటే మెచ్చవు

రేకు: 0032-4 శంకరాభరణం సంపుటం: 06-120

పల్లవి: తమ్మిం దమ్మిం దాఁకె తపియించంగా
అమ్మలే యమ్మలఁ దాఁకె నంతలోనె

చ. 1: చందురుం జందురు నేఁచె జాలికి జాలివుట్టె
మందమారుతము సోఁకె మందమాయే గాలి
తీఁగె సోఁకి తీఁగ వాడె తేనె దాఁకి తేనె చిందె
చేఁగ చిగురునం గాఁగె చెంగావి చిగురు

చ. 2: వేంకటేశ్వరునిమీఁద వేంకటేశ్వరుండు వచ్చె
సంకె మీదసంకె దేరె సకియభాగ్యమే

రేకు: 0032-5 ఆహిరి సంపుటం: 06-121

పల్లవి: బడలివున్నాఁడు ఉప్పరిగలోన గుట్టు
విడిచి విభునిం జేర వచ్చేయవె

చ. 1: చిలుకు నీనగవులే చిలుపాలు నీ
పలుచని నీ తెలి చూపుం బాశాలు
చలివేఁడికసరులే శాకాలు యింపు
దొలఁచి నీపతికి విందులు వెట్టవే

చ. 2: జడియు నీ చెమటలే జలకాలు నీ
కడుమంచి మెయితావి గందాలు
వెడయూర్పు విసరులే విభవాలు నీ
పొడముఁ బలుకుల తప్పులు వాపవే

చ. 3: కమ్మని నీమాటలే కప్పురాలు నీ
తమ్ములపుంజెదరులే తలఁబ్రాలు
నెమ్మది వేంకటగిరి నిలయుని నీవు
క్రమ్మఱం గ్రమ్మర నిట్టే కౌఁగిలించవే

రేకు: 0032-6 శ్రీరాగం సంపుటం: 06-122

పల్లవి: పాయపు మీ మీ ఫలమ్మూ, యీ
కాయపు సుఖములు గైకొనవద్దా

చ. 1: చింతమోముతోడఁ జెక్కునం జేతితో
నెంతైనం బొదల విదే మమ్మా
అంతటి రమణుం డబ్బె ననుచు నీ
చెంతనే కౌఁగిటం జేకొనవద్దా!

చ. 2: విసుగుమోముతో వెరగులాగుతో
నిసుమంత నవ్వ వేమమ్మా!
కసరేమి లేక కౌఁగిట నీవిట్టే
ఒసపరిరీతి నుండంగ వద్దా

చ. 3: అరవిరిరీతి నబ్బురపుమేన
నెరవై వుండే విదేమమ్మా!
తిరువేంకటేశుం దెగఁగొంటివిట్టే
ఉరముపై దిగ కుండంగవద్దా

రేకు: 0032-7 శ్రీరాగం సంపుటం: 06-123

పల్లవి: కౌఁగిట నిన్నుం గలయం గలవాఁడు విరహాన
వేఁగక యెట్లానుండు వినవే తరుణి

చ. 1: చిత్తజానలముచేతఁ జిట్లె గందపుఁబూత
మెత్తని తనువుమీఁద మెఱయంగా
ఒత్తిలి యొకతెమీఁద నొరగి పలుకవు నీ
చిత్త మిప్పు డెందువోయెఁ జెప్పవే తరుణి!

చ. 2: తొంగలి రెప్పలలోని తొలుకరి మెఱుఁగులు
చెంగలించి నలువంకఁ జెదరంగాను
బంగారు పతిమవంటి పడఁతి నీమ్మైఁదీఁగ
ముంగిట వేయక యిట్టె ముయ్యవే తరుణి

చ. 3: వీడినది మొలనూలు విరులు చెదరెం గొంత
వాడినది కెమ్మోవి వన్నెలై
కూడితివి చెలి నీవు కోనేటిరాయనిపొందు
ఈడఁ గొత్తలాయ నేఁటికే వోతరుణి!

రేకు: 0033-1హిజ్జిజి సంపుటం: 06-124

పల్లవి: ఇయ్యింతిమురిపెము యెట్లుండెనే
ఒయ్యారముతో నొరపోలికనో యనఁగా

చ. 1: చక్కని రమణి గుబ్బ చనుదోయి కడు నిండి
యెక్కువ మద నరేఖ లెట్లుండెనే
అక్కరతో సతి హృదయమున వలపు విత్త
దుక్కిగా మరుఁడు గోళ్ళ దున్నించె ననఁగా

చ. 2: లలనకుంబులక మొలకలపైఁ జెమటలు
ఎలనవ్వుం జెక్కులపై నెట్లుండెనే
వలపను నునుంబైరు వాడకుండా మదనుండు
నెలవుగాఁ బైపైనె నీరు నించె ననంగా

చ. 3: అందపు నెఱులలోన నలరురేకులు జాఱి
యిందువదనకుం దురు మెట్లుండెనే
కందువ వెంకటపతి కౌఁగిటి పరవశాన
వందులేక పండి కైవ్రాలెనో యనంగా

రేకు: 0033-2 ఆహిరి సంపుటం: 06-125

పల్లవి: ఇందవయ్య మీసొమ్ము లేల మాకు
క్రిందుపడి యెవ్వతె యెంగిలి నేల నన్నదో

చ. 1: చెట్ట వట్టి తియ్యంగానే చేయి దీసుకొనేవు
ఒట్టు వెట్టుకొని నన్ను నొల్లనంటాను
రట్టుగ నాముద్దుటుంగరము నీచేఁ జిక్కె నిదే
పెట్టుకో యెవ్వతెవ్రేలం బెట్టి వేసారినదో

చ. 2: పాదమువట్టుకొనంగానే పలుకవైతివి నాతో
ఆదరించంబడేనంటా అలుకతోడ
పేదవారము మాకాల పెండెముచిక్కెనిదె వో
ఏదెస నెవ్వతెకాలిదెరవుదెచ్చినదో

చ. 3: కోపగించుకొన్న నాకుం గొమ్మనుచుం గంటమాల
మేపెటితీపులచేత మెడంబెట్టేవు
ఏపలరఁదిరువేంకటేశ నాతోనిటువలె
నీపనికింత సేసితి వింక నేమిసేతువో

రేకు: 0033-3 భూపాళం సంపుటం: 06-126

పల్లవి: సుదతితో నిం తేలని చూపి చెప్పరమ్మా
ఎదురెదురే చూచీ నెటువంటివలపో

చ. 1: చెక్కుమీది చెయ్యి దీయఁ జెప్పరమ్మా దీని,
చిక్కనిగుబ్బలు మూయఁ జెప్పరమ్మా!
చిక్కునెఱులు ముడువఁ జెప్పరమ్మా దేహ
మెక్కడో త నెఱుఁగదు యెటువంటి వలపో

చ. 2: చిత్త మేమిటికి వేఁచీఁ జెప్పరమ్మా యీ
చిత్తజుచే నేల నొచ్చీఁ జెప్పరమ్మా!
చిత్తణివిద్యలు మానఁ జెప్పరమ్మా శిర
సెత్తి యెవ్వరిని జూడఁ డెటువంటివలపో

చ. 3: చిదుగాయ సిగ్గు లెల్లాఁ జెప్పరమ్మా వొళ్లు
చిదిమి నా నెఱుంగదు చెప్పరమ్మా
చెదరెడిఁ దమకము చెప్పరమ్మా యిప్పు
డిదె వేంకటేశుఁ గూడె నెటువంటివలపో

రేకు: 0033-4 ఆహిరి సంపుటం: 06-127

పల్లవి: లంపుగుబ్బ గొల్లెతల లంజకాఁడ నీ
యింపులే వెదకంబట్టీ నెట్లరా వోరి!

చ. 1: చెప్పరాని వేడుకల సిగ్గులనే నిన్నాళ్లు
ఉప్పతిల్లుం గోరికల నుంటిం గాని
ఇప్పు డింతనిలువలే నేమిసేతు నీచిత్త
మెప్పుడు గాని రాదో యెట్లరా వోరి

చ. 2: చిల్లర సింగారాలు చెలులు సేయఁగ నేను
వొల్లనని యిన్నాళ్లు నుంటిం గాని
మల్లెపూవు వంటినన్ను మాసిన చీర తోడ
నిల్లు వెళ్లకుండఁ జేసి తెట్లరా వోరి!

చ. 3: కమ్మ నిపానుపున నీ కౌఁగిటలో నిన్నాళ్లు
ఉమ్మగింపుమేనితో నుంటిం గాని
దిమ్మరిసేఁతలతోడి తిరువేంకటేశ! నీ
యెమ్మె లింకా మానలే వెట్లరా వోరి

రేకు: 0033-5 శ్రీరాగం సంపుటం: 06-128

పల్లవి: ఎఱుంగుదు మిదే నీయేతు లెల్లా
తెఱవల నిటు దినదినము నేఁచేవు

చ. 1: చూపులనే తనిపేవు సొలపు లాడేవు
తీపులం గ్రిందుపడేవు తేలించేవు
ఆపనికి బెట్టుగా న న్నదలించేవు
మాపటి చేఁతలకే మచ్చిక చల్లేవు

చ. 2: అడుగరాని దడిగే వాసలు సేసేవు
మడుగులు గలంచేటి మాట లాడేవు
అడరి రాయి గరంగ నలపు చూపేవు
వడి నందనిపనికి వలపు చల్లేవు

చ. 3: చీర వెలిగా నవ్వేవు సిగ్గు విడిచేవు
మోర నిడుపు చేసుక మూఁతులు నాఁకేవు
చేరి చెఱంగు వట్టేవు శ్రీవేంకటేశుండా
సారెకు నిట్టే కూడేవు చనువు లిచ్చేవు

రేకు: 0033-6 శ్రీరాగం సంపుటం: 06-129

పల్లవి: రాను మీకడకు వోరమణులార పూవుం
బానుపు హరికి నేఁ బఱవవలయు నేఁడు

చ. 1: చెలఁగి దేవుండు నేఁడు సిరితో నేఁటికి నో
పొలయలుకలవలపులు నటించి
తలఁపోఁత విరహవేదనల నున్నాఁడు ఈ
చలిమందు లతనికి చాఁతవలయు నేఁడు

చ. 2: రమణుం డిప్పుడు ఇందిరాదేవియెదుటను
తమకించి యెవ్వతెనో తలంచెనట
కమల గోపింపం గాఁకల నారగింపండు ఈ
హిమజల మతనికి నీయవలయు నేఁడు

చ. 3: వెలఁదిఁ బాసి తిరువేంకటేశ్వరుడు
కలికియై కౌఁగిటఁ గలసెనట
తిలకము గరఁగేటి తిరుమేనిచమట యీా
వెలినుండి పలుమారు విసరవలయు నేఁడు

రేకు: 0034-1 శ్రీరాగం సంపుటం: 06-130

పల్లవి: ఏటితమకమే నా కింకను విని
నాటకములు బడి నమ్మిన వెనక

చ. 1: చెల్లఁబో యేలే నాచెలువము వీని
వొల్లనిమేనితో నుడుకుచును
వెల్లాయ మేలే నావిభవము వీని
చల్లఁగౌఁగిలి జడిసిన వెనుక

చ. 2: పొలఁతి నా కేలే యీపొందులు వీని
అలయింతవలపుల నలయుచును
చెలియ నాకేలే యీసిరులు వీని
తలఁ పంతకాఁకలం దగిలిన వెనుక

చ. 3: కదిసి నా కేలే యీగరువము వీని
పొదలుంబరవశానఁ బొరలుచును
ఇదివో శ్రీ వేంకటేశుండు వీని
యుదుటుంగూటముల నే నోసరినవెనుక

రేకు: 0034-2 భైరవి సంపుటం: 06-131

పల్లవి: అంత నంతం దమకాన నలసేవు మా
వింతగాని పొందు నీకు వ్రేఁగాయఁగా

చ. 1: చాయలకే మ్రొక్కేవు సన్నలకే చిక్కేవు
మాయిల్లు నీకింత మఱపాయఁగా
పోయినరాతిరి నిన్నుం బోకు మంటాఁ బలుమారు
చేయివట్టి పెనంగుట చేఁ దాయంగా

చ. 2: మచ్చరాన మలసేవు మాటలనే సొలసేవు
వెచ్చందనమే నీకు వ్రేఁగాయంగా
వచ్చివచ్చి నిలిచేవు వాడికలు సేసేవు
తచ్చన ప్రేమము నీకుం దగవాయంగా

చ. 3: మంచి విడె మిచ్చేవు మనసెల్లాఁ దచ్చేవు
వంచనలే కిట్టయినా వచ్చేవుగా
ఎంచరాని తిరువేంకటేశ నన్నుం గూడితివి
పొంచి పొంచి కానికగాఁ బొందితివిగా

రేకు: 0034-3 శంకరాభరణం సంపుటం: 06-132

పల్లవి: నేర్చితి నీవును నెయ్యము లూఁని
తేర్చినతేటలు తెలియవుగా

చ. 1: చదివితి నీవును సాందీపు(ప)నితో
వెదకే వెదకమును వేదములు
పెదవులు గదలియుం గదలని
మదనుని చదువులు నాఁడవి చదువవుగా

చ. 2: కరచితి నీవును కౌశికమునిచే
నెఱి నాయుధముల నేరుపులు
గుఱుతులు సోకిన గుబ్బున సారిగెటి
వొఁఅపులకై దువు లొల్లవుగా

చ. 3: తడిసితి నీవును దగుజలనిధిలో
నడరుచు మీనమ వై నాఁడు
కడుఁజెమటల వేంకటపతి నారతిం
దడసినట్ల మును దడియవుగా

రేకు: 0034-4 కాంబోది సంపుటం: 06-133

పల్లవి: చెలియ మోహము చూడరమ్మా
చెలియ మోహము నేఁడు చెలుల కగ్గలమాయ

చ. 1: చిత్త మాతని మీఁద చేయి చెలియ మీఁద
కొత్తైన గమనంబు కొన వేళ్ల మీఁద
తత్తరపుఁ దాపంబు తనువల్లి మీఁద
బిత్తరపుఁ గోపంబు ప్రియ సతుల మీఁద

చ. 2: అలపులును సొలపులును అంగజుని మీఁద
తలపంత యెడ లేక దైవంబు మీఁద
పలుకులును బంతములు ప్రాణంబు మీఁద
తెలుపులును తెగువలును దీమసము మీద

చ. 3: ఇంపు సొంపులు వేంకటేశ్వరుని మీఁద
గుంపైన చందురులు కుచయుగము మీఁద
కెంపుఁ గనుగవచూపు గిలిగింత మీఁద
దంపతుల పరిణతులు తమకంబు మీఁద

రేకు: 0034-5 పాడి సంపుటం: 06-134

పల్లవి: చింతచేఁ జిత్తంబు చిక్కువడిన ట్లాయ
కాంతక్రొవ్విరుల సింగారంపుఁ దురుము

చ. 1: చెలినుదుట మరుఁడు వ్రాసిన వ్రాఁతవలె నాయ
సొలపునను జెదరుంగస్తూరి పట్టు
జలజ లోచన గుండె జల్లనిన యట్లాయ
పులక జొంపముల మెఱుపుల చన్నుదోయి

చ. 2: వనిత వలపుల జలధి వడి మునిఁగినట్లాయ
కొన మిగిలి జారు చెక్కుల చెమటలు
మనసి జాగ్నుల పొగలు మతి నెగసిన ట్లాయ
తనివోని నిట్టూర్పు తాపంబు గాలి

చ. 3: కాంత పరిణత(తు)లు లెక్కలు వెట్టినట్లాయ
కంతు నునురేఖ లంగనమేనను
అంతరంగమున విభుఁడలముకొనిన ట్లాయ
సంతసపు వేంకటేశ్వరుపొందు చెలికి

రేకు: 0034-6 సామంతం సంపుటం: 06-135

పల్లవి: పులకజొంపములె పో పుంఖాను పుంఖముల
తెలుపులును మఱపులును దెచ్చెఁ గోమలికి

చ. 1: చేటెఱుంగనికూన చెలి చిత్తమే కదా
కోటికిని బడ గెత్తెఁ గోరికలను
తేటైన తమకములు దీని పొందుననెపో
పోటుఁబాటును జేసెఁ బొలిఁతి కన్నీరు

చ. 2: కలి మెఱుంగని విందు కాంత వయసే కదా
కలశంబు లెత్తెఁ దమకపు మేడకు
తెలిఁగన్నుఁగవచూపు దీనిచేఁతలనెపో
తలవాకిటికిఁ దెచ్చెఁ దరుణి ప్రాణములు

చ. 3: తనివెఱుంగనియూన తరుణి వేడుక గదా
నినుపులై రతులు పెన్నిధు లాయెను
వినుతింప నిదియపో వేంకటేశ్వరుఁ దెచ్చి
ఘన పరవశము తరంగములు గావించె

రేకు: 0035-1 సామంతం సంపుటం: 06-136

పల్లవి: తొయ్యలి కొప్పున సేవంతులు నించే విట్లనె
నెయ్యు మెల్ల నీకపైనె నించరాదా

చ. 1: చెలి శిరసు నెఱులు చిక్కు వుచ్చే విట్లనె
బలుపుంజిత్తము చిక్కు వాప రాదా
కులుకుచుం దరుణి చెక్కులు నొక్కి తిట్లనె
నులిచి నీవే యాస నొక్కరాదా?

చ. 2: సుదతికి నొసలం గస్తూరి మెత్తే విట్లనె
మృదువుమ్మెఁ జలు విట్లే మెత్తరాదా
కుదురుగుబ్బలమీద గోర నంటే విట్లనె
అదనంగౌఁగిట నిట్టేయంటరాదా?

చ. 3: పడఁతిపై నొరపుగం బవళించే విట్లనె
ఒడలిపై నాకెనిట్లే యుంచరాదా
తడసి వేంకటరాయ తమకించే విట్లనె
కడు దీని ప్రేమ మిట్టే కానరాదా?

రేకు: 0035-1 ఆహిరి సంపుటం: 06-137

పల్లవి: వావి గాదు నీకు నాకు వద్దు వద్దు నీ
తోవరా వెఱుతు మన్నా దోసాలు గట్టకురా

చ. 1: చక్కనివాఁడ ననుచు సారెసారె నీవు వోరి
లెక్కలేని నొయ్యారములే చల్లేవు
తక్కుల మొన్న నామఱందలితోడ నీవు వోరి
తొక్కులాడితివి చాలు దోసాలు గట్టకురా

చ. 2: చూడకురా నా వంక సోయగపు నీవు యీ
వేడుక చిఱునగవే వెదచల్లేవు
కూడితి నాచెలిమి మక్కువ విన్న నీవు వోరి
తోడనే యింతేసి నాకు దోసాలు గట్టకురా

చ. 3: రాఁగినది నీ చిత్తము రంతుకాఁడ నీవు వోరి
మాఁగిన నా మనసు పై మచ్చు చల్లేవూ
కౌఁగిలించి నన్ను వెంకటరాయ నీవు వోరి
తఁగు మంచానకుం దీసి దోసాలు గట్టకురా!

రేకు: 0035-3 శంకరాభరణం సంపుటం: 06-138

పల్లవి: చతురుం డని నాసరసతలూ
ఇతరము లైనవి యేమి సేతురా

చ. 1: చెనకుచు నీవు నాకు సేసిన మేలు
పెనఁగొని మతిలోఁ బెరిగేని
మనసు తమకమై మదనతాపమయి
యెనలేని విభుఁడ యేమి సేతురా

చ. 2: కదలు నీ మురిపపుంగన్నుల నగవు
పొదలుచు నామతిఁ బొలసిని
చెదరని యలపై చింతారతియై
హృదయము రేఁచి నేమిసేతురా

చ. 3: ఇపు డిటు నీవు నా కిచ్చినచనవు
అపరిమితములై యలరీని
విపులవిభవమై వేంకటేశ!నా
కెపుడు బాయ దిదే యేమి సేతురా

రేకు: 0035-4 ముఖారి సంపుటం: 06-139

పల్లవి: అరిది చేఁదుం దీపై నంతకంటేనా
సరిలేని విభుతోడఁ జయ్యాటమాడేవు

చ. 1: చలమునం బగవారు సైతము నొకవేళ
పలుక దేరే రట యంతకంటేనా
పొలయలుకలు దీరి పురుషుఁడిప్పుఁడు నిన్నుఁ
బిలువఁ బంపనయంత బిగు వేలే నీకు

చ. 2: తప్పులు సేసిన వారి దయసేసి రాజైన
అప్పుడే మచ్చికం గూడీ నంతకంటేనా?
తిప్పిన మొకము తోడి ధీరుండు విభుండు నీకు
గప్పురపు విడె మియ్యంగఁ గడకంటఁ జూడవు

చ. 3: యెడసి యెదిరిం దము నెఱుంగక పైకొన్న
నడవిమెకాలు గూడీ నంతకంటేనా?
కడు నొవ్వ నాడి వెంకటవిభునికి నీవే
వెడమోము కూటముల వెఱపించుకొనేవు

రేకు: 0035-5 వరాళి సంపుటం: 06-140

పల్లవి: కలిగెంగా నేఁడు కాంతకు లోని
వలవంత సొలపులే వరునిసన్నుతులు

చ. 1: చెలువపు విభునిఁ జూచిన కన్నులకును
మలయు లేఁగురులే చామరతతులు
కలికి రమణునిఁ బొగడిననోరికిని
అలము నిట్టూర్పులే ఆలవట్టములు

చ. 2: సిరులందు విభుని డాఁచిన తలంపునకు
అరిది తలంపులే పాయనిపూజలు
పరువంపుఁబతి నాసపడిన గుబ్బలకు
అరవిరి చెమటలే అభిషేకములు

చ. 3: వెంకటపతితో నవ్విన నవ్వులకును
అంకెలమోవి తియ్యని బోనము
జంకించి యితనిపైఁ జూఁచు బొమ్మలకు
బింకపునటనలే ప్రియములగములు

రేకు: 0035-6 ఆహిరి సంపుటం: 06-141

పల్లవి: కాఁగె నిట్టూర్పులై గాలి మారుకుమారు
ఈఁగి చేసినదైవ మెఱుఁగఁడాచేత

చ. 1: చెలికి విరహాగ్ని రేఁచినఫలము చెదరఁగా
ఎలఁదేఁటు లలకలై యెదు రెదురనె
పొలఁతికోవిలలు నటువలెనెపో లలితాంగి
పలుకులై సన్నగిలెం బాయునా చేఁత

చ. 2: చెంది వెన్నెలల వేఁచిన ఫలము బడలెఁగా
చందురుఁడు వదనమై సతి కిచటనె
అందంద కలువలకు నట్లఁబో కలువలై
పొందెడలి యరమొగిచెఁ బో నాచేఁత

చ. 3: పడతివేఁచిన ఫలము పన్నీరు నుడికెఁగా
ఉడికేటి చెమటలై యొడలిమీద
అడరి యంతట వేంకటాధిపుని కౌఁగిటనె
తొడరి యిన్నియు దీర్చె దొరకెఁగా చేఁత

రేకు: 0036-1 ముఖారి సంపుటం: 06-142

పల్లవి: కన్నుల తుదలం గెంపు గానరాఁగాను నీకు
నన్నువ యలుకలు వేఱాయ నొసవితిమి

చ. 1: చేరి నీ గుబ్బలమీఁది చెమట ముత్యము లోలి
తోరపు ముత్యాల సందుల నుండంగా
కూరిమి నీ పతి రతిఁ గూడిన నిబ్బరమున
హారములు చెదరి యే మాయ నొసవితిమి

చ. 2: పెట్టిన కస్తూరి బొట్టు బెరసి నీ కురులతో
నట్టునిట్టుం జిందు వందు రై యుండంగా
మెట్టుకొని చందురుని మింటిమీది రాహు వచ్చి
పట్టపగలె యెలమిం బట్టె నొసవితిమి

చ. 3: ముదిత నీకరమూలములను వేంకటపతి
ఉదుటుంజేఁతలు నిండి ఉండంగాను
పొదలు మొగ్గలతోడి పూలతీగెలతావి
వెదచల్లుచును విఱ్ఱవీఁగె నొసవితిమి

రేకు: 0036-2 శ్రీరాగం సంపుటం: 06-143

పల్లవి: అతనుని సరకులే యంగడివి
అతివలె కడు నీ కమ్మెద రదివో

చ. 1: చక్కందనములు జవ్వనమదములు
చెక్కుల నగవులు సిగ్గులును
మొక్కుల చూపులు మురిపంబులు నీ
యక్కఱ దీరఁగ నమ్మెద రదివో

చ. 2: గుబ్బల మించులు కొప్పుల చెదరులు
సిబ్బెపు మేనుల చెమటలును
గబ్బితనంబులు గసరుల జంకెలు
అబ్బరముగ నీ కమ్మెద రదివో

చ. 3: తలపోఁతలు చింతాపరవశములు
వలచి వేంకటేశ్వర నీకు
కల వీ యంగడిఁ గదియకు నన్నిటు
లలసితి విదె నీ కమ్మెద రదివో

రేకు: 0036-3 కాంబోది సంపుటం: 06-144

పల్లవి: మొత్తకురే యమ్మలాల ముద్దులాఁడు వీఁడె
ముత్తెమువలె నున్నాఁడు ముద్దులాఁడు

చ. 1: చక్కని యశోద దన్ను సలిగతో మొత్తరాఁగా
మొక్కఁబోయీఁ గాళ్లకు ముద్దులాఁడు
వెక్కసాన రేపల్లె వెన్నలెల్లా మాపుదాఁకా
ముక్కున వయ్యంగఁదిన్న ముద్దులాఁడు

చ. 2: రువ్వెడితాళ్లఁదల్లిరోలఁ దన్నుఁ గట్టెనంటా
మువ్వల గంటలతోడి ముద్దులాఁడు
నవ్వెడిఁ జెక్కులనిండా నమ్మిక బాలునివలె
ముప్పురలో నెక్కుడైన ముద్దులాఁడు

చ. 3: వేల సంఖ్యల సతుల వెంటఁ బెట్టుకొని రాఁగా
మూలఁ జన్ను గుడిచీ నీముద్దులాఁడు
మేలిమి వెంకటగిరి మీఁద నున్నాఁడిదె వచ్చె
మూల భూతి దానైన ముద్దులాఁడు

రేకు: 0036-4 దేసాళం సంపుటం: 06-145

పల్లవి: ఇంతిరో నీ కోప మింతేటికే
చింతవాయఁ గరుణఁ జూచీ గాని నిన్నును

చ. 1: చిత్తమేమి రాయో చెలియ నిన్నతఁడేమి
కొత్తగాఁబాలించె నో కూరిమి లేదో
వత్తునని రాకుంటె వచ్చీగా కిందేమి
తత్తరానఁ గన్నీటఁ దడిపేవు పయ్యెద

చ. 2: అలుకేమి బరవో యతఁ డేమి యరవో
కలికి చేఁతలు నీకుఁ గరవో
సొలసి నీ కడకంటఁ జూచినఁ నాతని గుండె
తలఁక కెట్టుండె నీతలఁ కేలె నీకూ

చ. 3: పువ్వుల వేసినంతనే పొక్కెనట నీమేను
నవ్వు లెంత జూపు నీకు నమ్మికగాదా!
యివ్వల నప్పుడే వేంకటేశుం డిదె నన్నుఁ గూడె
దవ్వులే చేరువ లాయె దక్కెఁగా నీ పనులు

రేకు: 0036-5 దేశాక్షి-యెకతాళి సంపుటం: 06-146

పల్లవి: పరతత్త్వం బగు బాలుఁడు
పరిపరి విధముల బాలుఁడు

చ. 1: చద్దుల మూటలు చంకల వ్రేలెడి
ముద్దుల పడుచుల మూఁకలతో
పెద్దఱికంబునఁ బేయలఁ గాచిన
బద్దుల నటనల బాలుండూ

చ. 2: వెన్నలు దాఁకఁగ వేల్లాడుచును
సన్నపు బడుచుల సంగడిని
కన్నెలు దూరఁగఁ గలకల నవ్విన
పన్నిన మాయల బాలుండు

చ. 3: బచ్చన రూపుల పాయపుఁ బడుచులు
నిచ్చలుఁ గొలువఁగ నెమ్మదిని
నచ్చిన వేంకట నగమున నాడెడి
పచ్చిల పదకపు బాలుండు

రేకు: 0036-6 శ్రీరాగం సంపుటం: 06-147

పల్లవి: అప్పళించిన జవ్వాది యంటినమేనులతోడ
తొప్పం దోఁగు చెమటల దొరుగు టెన్నండురా

చ. 1: చెక్కువట్టి కదలించి చిఱునవ్వుతోడి నోరు
నొక్కి కౌఁగిలించి నోరునోరు గదియించి
అక్కిలివొయ్యనిమాట లాడి పేరుకొని తిద్ది
మక్కువ దలంచి మేను మఱచు టెన్నండురా!

చ. 2: ఉరముపై చనుగుబ్బ లూఁది పులకలు నించి
సరిలేని యధరము సారెసారెయు నాని
సిరిగల కొనగోరు సిరసు పై నొత్తియొత్తి
సుర వైభవములఁ జొక్కు టెన్నండురా

చ. 3: చాలియుం జాలని యట్టి సౌఖ్య సంపదలచే
తేలగిలెడికన్నుల తెలివాలుఁ జూపుల
యీలాగు తిరువేంకటేశుండు మనకు నబ్బి
నీ లోపల నేఁగలసి నీవౌట యెన్నండురా!

రేకు: 0037-1 భూపాళం సంపుటం: 06-148

పల్లవి: తొయ్యలి భారపుఁ దురుమమరె
ముయ్యక మూసిన మురిపమున

చ. 1: చందన గంధికిఁ జనుగుబ్బలపైఁ
జందెపు ముత్తెపు సరులమరె
చెందిన వేడుక చెలి నుపనయనము
జందెము వేసిన చందమున

చ. 2: అంచగమనకును అలపుల నడపుల
ముంచిన మట్టెల మ్రోఁతమరె
పంచమ వేదము పంచసాయకుఁడు
చంచునఁ జాటినచందమున

చ. 3: బొట్టుగఁ గుంకుమ పొలఁతి నుదుటిపై
గుట్టుగఁ బెట్టిన గుఱు తమరె
రట్టడి వేంకటరమణునికౌఁగిటఁ
బట్టము గట్టిన భావమును

రేకు: 0037-2 శ్రీరాగం సంపుటం: 06-149

పల్లవి: ఉదయాద్రి తెలుపాయె నుడురాజు కొలువిడె
అదనెఱిఁగి రాఁడాయె నమ్మ నా విభుఁడు

చ. 1: చన్నులపై ముత్యాల సరు లెల్లఁ జల్లనాయె
కన్నులకుఁ గప్పాదవెఁ గాంత నాకిపుడు
కన్నెకలువల జాతి కనుమోడ్చినది మీఁద
వెన్నెల వేసంగి మొగ్గ వికసించె గదవె

చ. 2: పువ్వుల లోపలి కురులు బుగులుకొనఁగా నెఱసె
దవ్వులఁ దుమ్మెద గములు తరమి డాయఁగను
రవ్వసేయశుకపికము రాయడి కోర్వఁగరాదు
అవ్వల నెవ్వతెపసల కలరున్న వాఁడో

చ. 3: పన్నీట జలక మార్చి పచ్చకప్రము మెత్తి
చెన్నుగం గొప్పున విరులు చెరువం దురిమి
యెన్నంగల తిరువేంకటేశుం డిదె ననుం గూడె
కన్నులు మనసు నుం దనియం గరుణించెం గదవే

రేకు: 0037-3 శుద్ధవసంతం సంపుటం: 06-150

పల్లవి: తాపంబుం గోపంబు తమకుందామే వేఁగు
పై పై నే వగపు లోపలి కెల్లా వేఁగు

చ. 1: చెలియ దురిమిన తురుము శిరసునకుఁ గడువేఁగు
తలపోత శిరసు కరతలమునకు వేఁగు
కొలఁది మీఱిన యూర్పు కుచయుగములకు వేఁగు
బలువు కుచములు నాభిపయి కల్లవేఁగు

చ. 2: మురిపంపు నడపు చెలిమొలనూలికిని వేఁగు
బిరుసైన మొలనూలు పిరుఁదునకు వేఁగు
అరిది జఘనము మందయానంబునకు వేఁగు
తరుణి గమనము పాదతలమునకు వేఁగు

చ. 3: మృగనేత్రిప్రాణంబు మేని కింతకు వేఁగు
బుగులుకొను మైకాఁక పులకలకు వేఁగు
తగు వేంకటేశు కృప ధైర్యంబునకు వేఁగు
అగపడిన యీపొందు అలుకలకు వేఁగు

రేకు: 0037-4 కన్నడగౌళ సంపుటం: 06-151

పల్లవి: చక్కని సరసపు శిశువు
పెక్కుమాయల పెను శిశువు

చ. 1: చిమ్మెడి విషములు చేపిన రొమ్ములు
కొమ్మని యిచ్చినఁ గుడిచేని
బొమ్మర పోవఁడు పూతకిఁ బొరిగొని
అమ్మరో గయ్యాళి శిశువు

చ. 2: చుట్టమువలెనే సుడిగాలినిఁ గని
బెట్టుగఁ గౌఁగిట బిగించేని
పుట్టఁడు వొడమఁడు బూమెలే చేసీ
పట్టరే పసి బాల శిశువు

చ. 3: పాదము చాఁ చటు బండి జాతురకు
ఆదిగొనుచు తా నలరీని
వేదవేద్యుఁ డగు వేంకటగిరిపై
మోద మందిన మున్నిటి శిశువు

రేకు: 0037-5 ముఖారి సంపుటం: 06-152

పల్లవి: ఇంతి చేసిన పూజ లిట్లుండెఁ దన హృదయ
మంతయును బూజించె నడియాసచేత

చ. 1: చనుదోయి పూజించె జాజుఁబులకలచేత
కనుదోయి పూజించెఁ గన్నీటి చేత
మనసు పూజించెఁ బ్రేమపుఁ గోరికల చేత
తనువు పూజించెఁ బరితాపంబు చేత

చ. 2: తలపు పూజించెఁ జింతాపరంపర చేత
అలపు పూజించె నొయ్యని పలుకుచేత
వలపు పూజించెఁ బొలయలుక చేతను నెంతే
సొలపు పూజించెఁ దన చూపరల చేత

చ. 3: అనఘుఁ డీ తిరువేంకటాద్రీశు కృప చేత
వనిత సంభోగ పరవశముఁ బూజించె
తనివోని గుఱుతుచే తనవిలాసములచే
గనుపట్టఁ బూజించె గళమర్మములను

రేకు: 0037-6 భూపాళం సంపుటం: 06-153

పల్లవి: లేని భ్రమ లుడిగి లేవయ్యా
లేనగుమోముతో లేవయ్యా

చ. 1: చెంచెత కౌఁగిటఁ జెలఁగి వేడుకఁ బవ
ళించిన నాథుండ లేవయ్యా
పించెపుం బయ్యెదఁ బెనగి రతినిఁ జా
లించి యింతటను లేవయ్యా

చ. 2: చక్కని శ్రీసతి చనుఁగవ సన్నపు
లెక్కలు వ్రాయక లేవయ్యా
పెక్కగు నమృతము పెదవికోమలికి
లిక్కిగఁ జేసితి లేవయ్యా

చ. 3: ఏకాంతలో ని న్నెనసి తలఁచి రని
లేకలు వచ్చెను లేవయ్యా
శ్రీ కాంతుఁడవగు శ్రీ వేంకటనా
ళీకదళాక్షుఁడ లేవయ్యా

రేకు: 0038-1 పాడి సంపుటం: 06-154

పల్లవి: ఇంతేపో వల పిందరికి
దొంతల వింతల రంతులును

చ. 1: చిత్తపు టీతఁలు చిడిముడి సేఁతలు
పొత్తుల తమ తల పోఁతలును
మెత్తని యధరపు మేఁతలు లోలో
కుత్తికెఁ గులికెడి కూఁతలును,

చ. 2: చూపుల తీపులు సొక్కుల పులకలు
దాపుల తమతమ తమకములు
కోపపు కిసరులు కూటపు కొసరులు
ఏపున విరహపు టెసరులును

చ. 3: పువ్వుల వాట్లు వున్నమ చాట్లు
నవ్వుల హృదయపు నాట్లును
రవ్వగు వేంకటరమణునిఁ గలిసిన
యివ్వల మరువం పేట్లును

రేకు: 0038-2 కన్నడగౌళ సంపుటం: 06-155

పల్లవి: మనసు తన పాలింటి మమకార భూతమై
అనయంబు నిన్నిటికి నాధార మాయ

చ. 1: చూపులాసలఁ దగిలి సుఖయించఁ బోయినను
పై పైనె తలఁపులో పరితాప మాయ
తాపంబుం బరవశము తనువు సొగసిన మఱియు
నాపదల కన్నిటికి నది మూల మాయ

చ. 2: తలఁపు లోపలి రతులఁ దమకించఁ బోయినను
తలఁపు వలపుల కెల్లఁ దగులాట మాయ
వలపులనియెడి మహా వైభవము వొడగనిన
నలపులును సొలపులును నతిఘనము లాయ

చ. 3: కడు సొలసి శేషాద్రి ఘనుని దూరినయంత
అడరి యాతని కోప మగ్గలం బాయ
కడలేని కోపంబు కరుణారసముతోఁ
దడిసి యీపొందులకుఁ దరవుకాఁ డాయ

రేకు: 0038-3 కాంబోది సంపుటం: 06-156
పల్లవి: ఏలరాఁడే చెలి నన్ను నెలయించి పచ్చవన్నె
చేలగట్టి పిలిచుంగు చెరిగినవాఁడు
చ. 1: చీకటి మేని వాఁడు చెలువై నమణులకు
వేకటైన తరుణికి కూఁకటతో మగండు
రోఁకటి కైదువవాఁడు రోలఁ గట్టువడ్డవాఁడు
ఆఁకటికి పాలువెన్న లారగించేవాఁడు
చ. 2: పంకజములోని యింతిం జంకంబెట్టి యంతఁబోక
అంకులచేతులవారి కాసచేసేవాఁడు
బింకపు రాకాసుల పేరుమాల్చినవాఁడు
వంకల వంకల మేన వన్నె వెట్టువాఁడు
చ. 3: పాలవారియింటి పిన్న పాపఁడై తిరిగినాఁడు
గాలి దాగువాని మీఁదఁ గాలు సాఁచినాఁడు
పాలమీఁది కొండమీఁదఁ బల్లెగట్టిలోక మెల్ల
నేలుచున్నవాఁడు వేంకటేశుఁ డమ్మ యితడు

రేకు: 0038-3 రీతి గౌళ సంపుటం: 06-157

పల్లవి: నాలం వా తవ నయవచనం
చేలం త్యజ తే చేటి భవామి

చ. 1: చల చల మమ సంఘ్ఘటనే కిం
కులిశ హృదయ బహుగుణ విభవ
పులకిత తను సంభృత వేదనయా
మలినం వహామి మదం త్యజామి

చ. 2: భజ భజ తే ప్రియా భావం సతతం
సుజన స్త్వం నిజ సుఖ నిలయ
భజ రేఖా రతి భోగిభవసికిం
విజయీభవ మద్విధిం వదామి

చ. 3: నయ నయ మా మనునయనవిధం తే
ప్రియకాంతాయం ప్రేమభవమ్
భయహర వేంకటపతే త్వం మ
త్ప్రియోభవసి శోభితా భవామి

రేకు: 0038-4 శ్రీరాగం సంపుటం: 06-158

పల్లవి: పువ్వుల వలన నార పొదలి తలకెక్కిన
ట్లెవ్వరును నిను( గూడి యేపు మిగులుదురు

చ. 1: చెలియకీ పెను(దురుము చీకటే వెలు(గాయ
కలికి కను(గొనల తొలుకరి మెఱుపులా
వలనైన తెల్లగల వారి సంగడి నున్న
మలిన దేహులు కాంతి మహిమ( జెందుదురు

చ. 2: లేమకీనెన్నడిమి లేమే కలి మాయ
మోమునకు నెగురు కుచముల బరువున
కామించి పేదలును గలవారికడ నున్న
వేమారు సంపదల విఱ్ఱవీ(గుదురు

చ. 3: జలజాక్షి చిత్తచంచలమే తిర మాయ
కెలసి నిన్నిట్ల కౌ(గిట( గలయ(గా
వెలు(గొందు నిశ్చలులు వేంకటేశ్వరు(డ నీ
చెలిమి వెడమ మతులైన సిరుల( జెందుదురు

రేకు: 0038-5 సామంతం సంపుటం: 06-159

పల్లవి: వలపువో కారణము వైభవంబులకుఁ దమ
తలఁపువో సకలంబుఁ దగులు సేసినది

చ. 1: చూపువో ప్రియములకుఁ జోటుసేసినది తరి
తీపువో వెడ యాస దీరనీయనిది
రూపువో సౌఖ్యంబు రుచి సేసినది పువ్వుఁ
దూపువో హృదయంబు దూరిపాఱినది

చ. 2: ఒఱపువో పెడఁబాసి వు డనియ్యనిది తమ
వెఱపువో దేహంబు వెచ్చఁజేసినది
మఱపువో ధైర్యంబు మానిపించినది కను
గిఱుపువో సిగ్గెల్లఁ గ్రిందు పఱిచినది

చ. 3: చెలిమివో కారణము శ్రీ వేంకటేశు కృప
కలిమివో మచ్చికలు కలుగఁజేసినది
ఎలమివో యీపొందు లితవు సేసినది మరు
బలిమివో కోరికలఁ బట్టి తెచ్చినది

రేకు: 0039-1 కాంబోది సంపుటం: 06-160

పల్లవి: కుసుమ కోమలి విభునిఁ గొనియాడునెయ్యంపు
వసివాడు మోము నవ్వక నవ్వినట్లు

చ. 1: చెలియ గుబ్బలమీఁది జిలుఁగుఁ బయ్యెద మెఱుఁగు
చలివెలుఁగు ననల దాఁచక దాఁచినట్లు
పాలఁతి మొలనూలి మొగపులదీప్తి సంసార
ఫల మిక్కడనుచు చూపక చూపినట్లు

చ. 2: తరుణి కనుఁగొనల బిత్తరి చూపు విభుమీఁది
పరవశం బెల్లఁ జెప్పక చెప్పినట్లు
గరితవ్రేఁకపుఁగొప్పు గడలు లావణ్యంబు
సరసత్వ మెల్లఁ బెంచక పెంచినట్లు

చ. 3: ఇంతి శ్రీ తిరువేంకటేశుఁ బొందినరతి
శ్రాంతి సౌఖ్యములు దలఁచక తలఁచినట్లు
కాంత లోఁ గొన్న మరుగతులు చెలులకుఁ దెలుపు
మంతనపు బాస పొడమక పొడిమినట్లు

రేకు: 0039-2 హిందోళవసంతం సంపుటం: 06-161

పల్లవి: లలితాంగి యౌవనము లావణ్యముల ప్రోవు
అలరి యిటువలెఁ జేసెనమ్మా

చ. 1: జవ్వాది మిగుల నుష్ణము మీఁద సంపంగి
పువ్వు గట్టినది గన పాదలెఁ దాపంబు
నివ్వటిలు గొజ్జంగి నీట నొయ్యన కడిగి
దువ్వటపుఁ బయ్యెదను దుడువరమ్మా!

చ. 2: మృగమదము గడు వేఁడి మెలుఁత తలపట్టునకు
అగలు గూడఁగ వేద నగ్గలంబాయ
బిగువైన కస్తూరి బేం ట్లొయ్యనగోరి
నగలించి తట్టుపునుఁ గంటరమ్మా

చ. 3: విరహతాపంబునకు వేరొండు గతిలేదు
పొరసి వేగించినాఁ బోదు
తిరువేంకటాచలాధిపుని మన్ననఁ గాని
అరిది మోహము దీరదమ్మా!

రేకు: 0039-3 పాడి సంపుటం: 06-162

పల్లవి: సదయ మానస సరోజాత మాదృశ వశం
వద ముదాహం త్వ వంచనీయా కిమ్

చ. 1: జలధికన్యా పాంగ చారు విద్యుల్లతా
వలయ వాగురి కాంత వనకురంగ
లలితభవ దీక్షా విలాస మనసిజబాణ
కులిశపాతై రహం క్షోభణీయా కిమ్

చ. 2: ధరణీవధూ పయోధర కనకమేదినీ
ధరశిఖర కేళితత్పర మయూర
పరమ భవదీయ శోభనవదనచంద్రాంశు
తరణికిరణై రహం తాపనీయా కిమ్

చ. 3: చతుర వేంకటనాథ సంభావయసి సం
ప్రతి యథా తత్ప్రకారం విహాయ
అతిచిర మనాగత్య హంత సంతాపకర
కితవకృత్యై రహం ఖేదనీయా కిమ్

రేకు: 0039-4 బౌళి సంపుటం: 06-163

పల్లవి: ఒడలి తాపముమీఁద నుసురనీని
కడలేని చిచ్చుమీఁద గాలి చల్లీఁ దరుణి

చ. 1: జల్లనం గొప్పు విరులు జారఁ దోఁచి జవరాలు
మెల్లనే తుమ్మిదలకు మేఁత వెట్టీని
చెల్లఁబో మీఁ దెఱుఁగదు జెప్పరమ్మ పెనుఁబాము
పిల్లలకుఁ బాలువోసి పెంచఁజూచీఁ దరుణి

చ. 2: గొప్పవైన గుబ్బలపైఁ గుంకుమ కస్తూరి పూఁత
లప్పలు గాలికిఁ దెచ్చి లంచ మిచ్చీని
ఒప్పదు మానుపరమ్మా ఉప్పతిలఁ బలుమారు
నిప్పుల మీదటఁ దెచ్చి నేయి చల్లీఁ దరుణి

చ. 3: చెనకించి యధరంపుఁ జిగురాకు కెంపుల
నొనరుఁ గోవిల నోరూరించీని
చనవున వేంకటస్వామి కౌఁగిటఁ గూడి
కినిసి పాసెములూఁ జక్కెర వెట్టెఁ దరుణి

రేకు: 0039-5 ఆహిరి సంపుటం: 06-164

పల్లవి: చూచియుం జూడవు సుదతివంక
నీచేఁత లిన్నియు నీకె చెల్లును

చ. 1: జిగి మించు నుంగరాల చెక్కుమీఁది చేయి
చిగురు చెంద్రిక గోళ్ల జెలువొందంగా
పగటుఁ గోపము తోడ భారపు టూర్పులతోడ
నిగి డున్న చెలి లాగు నీకే తెలును

చ. 2: పొడపు గుబ్బలి మీఁది పులిపట్టు చెఱంగు
జడిసి హారపుఁ గాంతి ఝళిపించఁగా
వడ చల్లుమేనితో వసివాఁడు జూపుల
నిడువాలుఁ గనుసొంపు నీకే తెలుసును

చ. 3: భారపుఁ దురుము మీఁద పసమించు నెఱులు
జీరువారి విరులతోఁ జెంగలించఁగా
చేరువనే కూడితివి శ్రీ వేంకటేశుండ
నీరజవదనలాగు నీకే తెలుసును

రేకు: 0039-6 సావేరి సంపుటం: 06-165

పల్లవి: ఊరకే పోనియ్యరా నన్నుద్దండాన
చేర లంతేసి కన్నులఁ జెంగలించే విప్పుడు

చ. 1: జూద మాడఁ బిలిచేవు చూపులనే జంకించేవు
పేదవారి మేన సొమ్ము పెట్టనియ్యవా
కేదమున నోడి గెలిచితినంటా నా
పాద మంటి తీసుకోరా బంగారు మట్టెలు

చ. 2: నెత్తమాడఁ బిలిచేవు నెఱవాది నంటాను
అత్తమామ గలవార మదేమి రా!
ఒత్తి విన్నవించలేము ఓడితేను నీకు నాకు
రిత్తమాట వద్దు రేఖరేఖ పందెమా!

చ. 3: సొక్కటాలు నిన్న నాడి సోలి సత్యభామకు
మ్రొక్కితివి నేఁడు నాకు మ్రొక్కవలెఁగా
చక్కని వేంకటపతిస్వామి నన్నుం గూడితివి
మొక్కెద కర్పూర తాంబల మిరా చాలును

రేకు: 0040-1 దేశా(సా)క్షి సంపుటం: 06-166

పల్లవి: అటువంటి వైభవము లమరఁ జేసినదైవ
మిటువంటియోగంబు లిన్నియును జేసి

చ. 1: జలజాక్షి లావణ్య జలధి నుప్పొంగింప
నలివేణి ముఖచంద్రుఁ డభ్యుదయమాయ
కలికి వలరాయఁడను కాలకూటంబుతో
దలకొన్న యధరామృతంబు జన్మించె

చ. 2: వనిత సౌభాగ్యంబువనధిలోపలఁ దోఁచె
గొనకొన్న గుఱుతైన కుచపర్వతములు
తనివోనికోరికల తగుతురంగములతో
ననువైన విరహ బడబానలము గలిగె

చ. 3: భామ యవ్వనమనెడి పాలజలనిధిలోన
వామాక్షియైన యవ్వనలక్ష్మి గలిగె
యీమంచి తిరువేంకటేశ్వరుం డిందులోఁ
బ్రేమమున సుఖియించి పెంపొందఁగలిగె

రేకు: 0040-2 ఆహిరి సంపుటం: 06-167

పల్లవి: ఏఁపుచు నాకా ళ్లితఁడేల పట్టేనె
రాఁపు సేసి నాకుఁ బెద్దమోఁపు గట్టినట్లు

చ. 1: తలమాసి కోకమాసి తాపమున నుండంగాను
యెలయించి యితఁడు నన్నేల యేఁచీనే
మలినమై దేహమెల్ల మఱచినఁ దలఁపించి
పులికి కాలఁగఁ గొఱవులఁజూఁడినట్లు

చ. 2: కూడుఁబాసి నీటిఁబాసి కొరమాలి వుండఁగాను
యేడనుండో వచ్చి యీతఁ డేల పోరీనే
వేడుక లన్నియు మాని వేదనల నుండఁగాను
కాఁడినపోట్లలోన కత్తిఁగోసినట్లు

చ. 3: తల్లిఁబాసి యిల్లువాసి తరిలేక వుండఁగాను
యెల్లగా కౌఁగిట నితఁ డేల నొక్కీనే
చెల్లునంటా నన్ను గూడి శ్రీ వేంకటేశుండు
ముల్లు ముంటనే తీసి మోసపుచ్చినట్లు

రేకు: 0040-3 ఆహిరి సంపుటం: 06-168

పల్లవి: నేరుపులమాట గాదు నీయాన
కూరమి నీచే జట్టిగొనక నిన్నొల్లను

చ. 1: తట్టుపునుంగుల తలచెంచెతను నన్ను
పట్టకురా నీకు నీపాదమాన
గట్టిగఁ దామరలోని కాంత మానితినని
గుట్టుదీర నానవెట్టుకొనక నిన్నొల్లను

చ. 2: పయ్యెద పాఱుటాకుల భారంపు గుబ్బల నన్ను
తియ్యకురా నీకు నీదేవరాన
ప్రయ్యములు తొమ్మిదైన పనిత మానితినని
కొయ్యతనమున బాసగొనక నిన్నొల్లను

చ. 3: నలఁగు జవ్వాదిమేని నన్నుఁ గడుంగౌగిట
నలమకు నీకు నీయమ్మాన
ఎలయించి తిరువేంకటేశ కూడితి నన్ను
కెలన నీవెటు దొలంగినను నిన్నొల్లను

రేకు: 0040-4 ఆహిరి సంపుటం: 06-169

పల్లవి: రమణుని చేఁతలు దక్కెను రావులు రంతుకు నెక్కెను
మమతలు లోలోఁ జొక్కెను మాటలు మఱియేలే

చ. 1: తలపోఁతలు తనుఁ గూడెను తాలిమి గంటును వీడెను
కలువలు ఇరుమ్మైఁ గాఁడెను కటకట యిఁక నేమే
బులుపులు సిగ్గుల కోడెను పులకలు సమతలు గూడెను
చలములకును విధి మూడెను జవ్వన మిది యేలే!

చ. 2: మచ్చికమానము రేఁగెను మచ్చరములె మతి మూఁగెను
చిచ్చును గాలియుఁ గూడెను చీచీ యిఁక నేమే!
ముచ్చట రతి కెదురేఁగెను మురిపము వెనుకకు వీఁగెను
వెచ్చి వివేకము, రాఁగెను వేడుక లిఁక నేలే

చ. 3: భారపు చెమటలు జాఱెను పై చెమటలు దైవాఱెను
కూరిమి కడుఁ దుద మీఱెను కొంకెడి దిఁక నేలే
వీరిఁడి వెఱపును జాఱెను వేంకటపతి కృప చేరెను
గారవములు కడుఁబేరెను కసరెడి దిఁక నేలె

రేకు: 0040-5 శ్రీరాగం సంపుటం: 06-170

పల్లవి: రాకురాకు మయ్యా మాతో రంతు లింతేలా
వాకు నిష్టూరాన నిన్ను వద్దనే నేఁ జాలను

చ. 1: తొలవయ్య కాలుదాఁకీ దోసాలు గట్టకా
తొలుతేమి చేసితినో తొయ్యలినైతి
చెలఁగి యిందఱూ నీకుఁ జేయెత్తి మ్రొక్కగా
చిలుకు గోళ్ల నిన్నుఁ జెనక నేఁ జాలను

చ. 2: ఏమిటికి నంటించేవు ఎంగిలి మామోవి
బూమిలేని చదువుల పుట్ట నీనోరు
వేమాఱు నిందఱు నీకు వినుతించి మ్రొక్కంగ
ప్రేమపునో ర నిన్ను పేరఁ దిట్టఁజాలను

చ. 3: యేల కిందుపడి మొక్కే వేమి బాఁతినే నీకు
కూళ నింతేని కాలిగోరఁ బోలను
మేలిమి శ్రీ వేంకటేశ మెఱసి మాచనవు
మేలములాడుచు నిన్ను మెప్పించ నేఁ జాలను

రేకు: 0040-6 ఆహిరి సంపుటం: 06-171

పల్లవి: కరేణ కిం మాం గృహీతుం తే
హరే ఫణిశయ్యా సంభోగ

చ. 1: జలే తవ సంచరణ మిహాధస్
స్థలే భవనం తవ సంతతం
బలె రూప ప్రకటన మతులా
చలే స్థానం చల చల రమణా

చ. 2: పదే భువన ప్రామాణ్యం తవ
హ్రదే ప్రచుర విహరణ మిదం
ముదేమునీనాం మోహనం తనుం
మదే తవ నర్మ చ మాం విసృజ

చ. 3: స్మరే విజయ స్తవ విమలతురగ
ఖురే రతిసంకుల రచన
పురే తవ విస్ఫురణం వేంకట
గిరే: పతే తే ఖేలాఘటిత

రేకు: 0041-1 సామంతం సంపుటం: 06-172

పల్లవి: దిమ్మరి గాకేల మాను ధీరుఁడైన కోనేటి
తిమ్మఁడు దా లోకమెల్లఁ దిరుగాడువాఁడు

చ. 1: తోరమైన ముత్యాల తొళసిపూసల పెద్ద
పేరు దనవురముపై బెట్టినవాఁడు
గారవంపుఁ బచ్చఁబట్టు గట్టినవాడు వొ
య్యారపు గొల్లెతలఁ గూడాడినట్టివాఁడు

చ. 2: పీలిచుట్టుదలవాఁడు పెదపెదకన్నుల
వాలుఁజూపుల సిరికి వలచువాఁడు
జాలిబెట్టి లోకమెల్ల జట్టిగొన్నవాఁడు తా
నేలనుండి మింటఁబాఱ గాలు చాఁచువాఁడు

చ. 3: కొండ మోఁచినట్టి వాఁడు కొండ వేల నెత్తువాఁడు
కొండంత రాకాసులఁ గొట్టినవాఁడు
కొండవంటిదొరయైన కొండల కోనేటివాఁడు
కొండమోఁపరుల నెల్లఁ గూడపెట్టినాఁడు

రేకు: 0041-2 కన్నడగౌళ సంపుటం: 06-173

పల్లవి: మఱపైన నొకకొంత మాటుగాదా
తెఱవ నూరక యేల తెలిపేరు సతులూ

చ. 1: తరుణిని విరహ సంతాపంబు దావాగ్ని
ధరియించ చెమటైన దండ గాదా
మరుని కార్ముకబాణమహిమ గడు నెఱుఁగించె
దురదురనఁ జేతులనె తుడిచేరు సతులు

చ. 2: పొఁలితి కిపుడొకయింత పొద్దువోకలు సేయ
తలపోఁతయైన దరిదాపు గాదా
వెలలేని సోయగపు విభుని చల్లని రూపు
పెలచమాటలనే మరపించేరు సతులు

చ. 3: అలివేణి మేని విరహాగ్ను లొయ్యన పూడ
నలరు నిట్టూర్పైన యాసగాదా
వలపెరిఁగి వేంకటేశ్వరుఁడు గరుణించె నిదె
కలువ పూవుల బంతి గట్టేరు సతులు

రేకు: 0041-3 కేదారగౌళ సంపుటం: 06-174

పల్లవి: ఏమి చెలియా యేలాగే
వేమారును వెల్లి విరిసీఁ బ్రేమా

చ. 1: తోడితేదొకో తొయ్యలివానిఁ
దోడితేదొకో తొయ్యలి
వాడీఁ జిత్తమిదె వనితరొ మై
గాఁడి మదనుని కమ్మవిరులు

చ. 2: తానే రాఁడొకో దైవమా వాఁడు
తానే రాఁడొకో దైవమా
నేనోప నిలువంగ నింకను
నానేరుపుల నానదు నామనసూ

చ. 3: వీఁడేఁ గదవే వేంకటేశుఁడూ వీఁడే
వీఁడెఁ గదవే వేంకటేశుఁడూ
నాఁడే నమ్మించే నన్నును
నేఁడే కౌఁగిట నెలకొనె నాకు

రేకు: 0041-4 భూపాళం సంపుటం: 06-175

పల్లవి: పొలయలుక నిద్దరలు భోగించ దొరకొంటి
అలర వడి మేల్కొనవె అఖిలేశ్వర

చ. 1: తరుణిమైనపుడె పరితాప సూర్యుఁడు వొడిచె
వరుసఁ జెలి కన్నుఁగలువలు మొగిచెను
మరుని సాయకపు తామరలు వికసించె
కరుణతో మేల్కొనవె కమలేశ్వర

చ. 2: కాంత నిట్టూర్పులను గాలియును నగ్నియును
వంత చెమటలవాన వరుణుండును
వింతలుగ నిన్ను సేవింతుమని యున్నారు
పంతమున మేల్కోనవె పరమేశ్వర

చ. 3: మెలుఁత పెనుఁదురుమనెడి మేఘమండలములో
నలుగడలఁ జెలఁగె సుమనసపంక్తులు
కులికి పూవులవాన గురియంగ నున్న దిదే
చలముడిగి మేల్కొనవె సర్వేశ్వర

చ. 4: కదిసి పులకలసృష్టి కడలేక పొడమించు
మదనుఁడను మానస కమల భవుఁడును
ముదిత కోపపుహరుఁడు మొనసి యున్నారిదే
నిదుర మేల్కొనవె జలనిధిశయనుఁడ

చ. 5: ఒడికముగఁ జెలిలోన నుదయరాగము వొడమె
వెడలె నదె పలుకుఁ గోవిలరవములు
పడఁతిఁ గూడితివి రవి పరవశం బిఁకనైన
కడఁగి మేల్కనవె వేంకటరమణుఁడ

రేకు: 0041-5 ఆహిరి సంపుటం: 06-176

పల్లవి: వోపలఁబుచ్చే వూరకిటు
నీవలె సొలయఁగ నేరర నేను

చ. 1: తీపులఁ బొదిగిన తేనెల యలుగుల
చూపు చల్లకువే సుదతి
ఏపున నీకిపు డెదురులు చూచిన
చూపుల నేమిటిఁ జూతుర నేను

చ. 2: చంచలబరచి చక్కని వదనము
వంచి నవ్వకువే వనిత
నించిన కాన్కల నినుఁ గని వదనము
వంచి నవ్వ నిట్టు వలదా నేను

చ. 3: తాలిమి హృదయము తల్లడ మంది
కాలు దొక్కకువే కలికి
జాలి వేంకటేశ్వర కౌఁగిట నిను
కాలు దాఁకె నేఁకటఁ బడ నేను

రేకు: 0041-6 ముఖారి సంపుటం: 06-177

పల్లవి: బయలీఁదించకురే పలుమరు యీా
ప్రియునిపేర నిందరినిఁ బిలిచీఁ జెలియా

చ. 1: తడవి తవ్వకురే తమకపుఁజెలమ
వుడుకుచు నువ్విళ్లూరీని
పుడికి పెంచకురే పులకల నారూ
వొడలి బడలికల నొరగీఁ జెలియా

చ. 2: దరికొలుపకురే తలపోఁతదాలి
కరసాన కాఁకలఁ గనలీని
పురికొలుపకురే పుక్కిటి వూరుపూలూ
శిరసు నొప్పుల చేతఁ జిమిడీఁ జెలియా

చ. 3: మంతన మాడకురే మతిలోని యలపులు
వంతలనే వదనము వంచీని
చెంతల విసరరె శ్రీ వేంకటపతి
సంతపు లేఁజెమటల జడిసీఁ జెలియా

రేకు: 0031-1 శ్రీరాగం సంపుటం: 06-178

పల్లవి: ఎటువంటి మోహంబు యెటువంటి పరిణతలో
అటువంటి సతి పొందు లవి నీకె తగురా

చ. 1: చక్కని జవరా లొకతె జారెడికొప్పొకచేతఁ
జెక్కుచు సన్నపు నవ్వు చిలికి చిలికి
చెక్కునఁ జెదరిన కమ్మం జెమటల తావులను
చొక్కుచు నిన్నరగంటం జూచె నెవ్వతెరా

చ. 2: గద్దరి కన్నుల కలికి కమ్మని చల్లగాలి
అద్దిన దేహము తోడ నలసి యలసి
ముద్దుల రెప్పలు దెరచి ముందటి నీ తనవలపు
సుద్దులు దెలుపుచు నిన్నుం జూచె నెవ్వతెరా

చ. 3: కొండల రాయండ నీ కొమరైన చెలిచన్నుఁ
గొండల నీ కెంగేలం గులికి గులికి
నిండిన కౌఁగిటిలోన నీవుం దానుం గలశుండి
వుండినటువలెం గూడి వుండె నెవ్వతెరా

రేకు: 0031-2 ఆహిరి సంపుటం: 06-179

పల్లవి: పాయరాని పదివేలు పనులు నీకు యీ
కాయము నీ విప్పుడైన కౌఁగిలించుమీ

చ. 1: చిత్తజు తాపము చేత చిక్కవడ్డ దానం గాన
వొత్తి నీతో విన్నవించ నోపం గాని
యెత్తిన నీ విరహాన యే మౌదునో నన్ను
చిత్తగించి యెప్పుడైనాఁ జేరంగరమ్మీ

చ. 2: తరి నిన్నుం బాసి మాట తడఁబడే దానం గాన
నెరి నిన్నుం దూరనాడ నేరం గాని
యెరగొని తలచీర యెరంగకున్నప్పుడైన
కరఁగి మఱవక నాకడ చూడుమీ

చ. 3: దవ్వుల నిందాఁక నీకు తమకించే దానం గాన
జవ్వన మంటకు మనం జాలం గాని
రవ్వైన వేంకటరమణ నావద్ద నిట్టే
పవ్వళించి నేఁడైనాఁ బాయకుండుమీ

రేకు: 0031-3 భైరవి సంపుటం: 06-180

పల్లవి: ఏటిపొందుయేఁటి గుణము యేటి సవరందనముమనసు
నాఁటుకొలుపం జేయలేని నటన లేఁటికే

చ. 1: చూపు చూపు తారుకాణ చూపులోని నగవులెల్ల
చూపి పులకరించ లేని సొబగు లేఁటికే
యేఁపు రేఁగి కోరికలకు యెత్తు సేసి మీదఁ మీద
తాప మందఁజేయలేని తనువు లేఁటికే

చ. 2: కదిసినపుడే మేను మఱచి కొఁగిలించినట్టి చేయి
వదలి కన్ను ముయ్యలేని వలపు లేఁటికే
తుదలనైన చెమటగముల తొప్పఁదోఁగి మోహరతుల
సదమదముగఁ దనుపలేని చనవు లేఁటికే

చ. 3: దేహధారి యైనఫలము తెలిసి వేంకటాద్రి విభుని
మోహ మందఁజేయలేని మురిప మేఁటికే
ఊహ దలఁచి తమక మంది వొకరి కొకరు యిట్ల నేఁడు
సాహసించి కలయకున్న జన్మ మేఁటికే

రేకు: 0031-4 దేసాళం సంపుటం: 06-181

పల్లవి: ఎట్టు ధరించే నింకాను
పట్టుట బరువీ ప్రాయము నాకు

చ. 1: చెప్పక వచ్చిన చిత్తము లోపలి
నొప్పులనేమై నొగిలీని
యెప్పుడు దలఁచిన హృదయము ఝల్లని
కుప్పలుగా మైఁ గురిసీఁ జెమటా

చ. 2: అంపలేక నన్నంపిన యప్పటి
తెంపు దలఁచిపో దిగుల నేను
యింపునఁదా నిపు డెట్లున్నాఁడో
కంపించీ మది కటకట యిపుడూ

చ. 3: తిరిగి చూచినను దేహము చిత్తముఁ
బరవశ మయ్యీఁ బలుమారు
తిరువేంకటగిరి దేవుఁడు కౌఁగిటఁ
గరుణించఁగఁ జీఁకటి వెడఁబాసె